PARLE

# Ram and Shyam

హుమ్మ్...పాపిన్స్!

**Monstroy**

POPPINS





























# WISH YOU A HAPPY 2008!

## CHANDAMAMA'S NEW YEAR RESOLUTION ... IS TO KEEP OUR PROMISES!

**A REVAMPED WEBSITE - www.chandamama.com**

- Regional language sites to go live
- Focus on short animation movies, multimedia edutainment kits and audio stories
- Interactive elements to roll-out, including Quizzes, Puzzles, Question forum

**BOOK PUBLISHING :**

- Compilation of the best from 60 years' archives– stories, serials, comics, etc...
- Audio Books

**Besides activities, something NEW every month**
**Be part of it... read about it in CHANDAMAMA**

**ENSURE YOUR COPY**
**with your nearest news stand**



**BETTER STILL**
**Enter an annual subscription**
**For details contact:**

SUBSCRIPTION DEPARTMENT
CHANDAMAMA INDIA LTD.
JVL Plaza, 6th floor, 626 Anna Salai
Teynampet, Chennai 600 018
e-mail: subscription@chandamama.com
For online Subscription : www.indiaplaza.in
Tel : 044 - 24334455
Fax : 2432 2103



చందమామ సంపుటి: 60 జనవరి 2008 సంచిక:01

## ఈ నెల విశేషాలు



నమ్మలేని నిజాలు (బే.క) ...19



పన్నాదాయ్ అనుపమత్యాగం ...30



చిలుక జోస్యం! ...55



రామాయణం (కిష్కింధా కాండ-3) ...65

## ఈ సంచికలో...





వ్యవస్థాపకులు

బి. నాగిరెడ్డి - చక్రపాణి

## అమరవాణి

మనోవాక్కాయాల
పుణ్యం పూర్తిగా
చేసుకున్నవారై,
మూడు లోకాలకూ
ఉపకారం చేస్తూ,
ఇతరులలోని గోరంత
మంచిని కొండంతగా
చూసి ఆనందించే
మంచివాళ్ళు చాలా
కొద్దిమంది
ఉంటారు.



# నూతన శకారంభం!

పన్నెండు భాషలలో అరవైయేళ్ళకుపైగా ఒక పత్రిక వెలువడడం అన్నది అసాధారణమైన విషయం అని మన పాఠకులు తరచూ ఉత్తరాల ద్వారా అభినందనలు తెలియజేస్తూ ఉన్నారు. ఈ విలక్షణమైన విజయానికి మూడు తరాల పాఠకుల తరగని ప్రేమాభిమానాలే కారణం అన్నది చందమామ దృఢ అభిప్రాయం.

వైజ్ఞానిక ప్రపంచంలో సాంకేతికరంగం సాధిస్తున్న ప్రగతి దృష్ట్యా, మరో అడుగు ముందుకు వేసి–డిజిటల్ రంగప్రవేశం చేసి ప్రపంచ వ్యాప్తంగా ఉన్న లక్షలాది పాఠకులకు విజ్ఞానాత్మకమైన వినోదాన్ని 'యాక్టివిటీ ఓరియంటెడ్ వెబ్‌సైట్' ద్వారా సమకూర్చనున్నామని లోగడే తెలియజేశాం.

గత అరవైయేళ్ళ కథలు, చిత్రాలు కావాలని పలువురు పాఠకులు ఉత్సాహం కనబరుస్తున్నారు. అలాంటి అభిమానుల కోరికను 'చందమామ. కామ్' ద్వారా నెరవేర్చగలమని మాట ఇచ్చాం.

చందమామకే ప్రత్యేకమైన కనులవిందు చేసే వర్ణచిత్రాలతో కమ్మని కథలను పుస్తకాలుగానే చదవాలని ఆసక్తి కనబరుస్తున్న అసంఖ్యాక పాఠకుల కోసం పాత సంచికల నుంచి సేకరించిన ఉత్తమ కథాసంకలనాలు తీసుకురాగలమని కూడా ప్రకటించాం.

ఇలా చేసిన వాగ్దానాలన్నీ పవిత్రమైనవి; వాటిని ఒక్కొక్కటిగా నెరవేర్చ వలసిన గురుతర బాధ్యత మాకు ఉన్నది. అవన్నీ కూడా కార్యరూపం దాల్చే సమయం ఆసన్నమవుతున్నది. అందువల్ల 2008వ సం. చందమామ నూతన శకానికి నాంది పలుకుతుందనడంలో సందేహం లేదు.

అభిమాన పాఠకులకూ, శ్రేయోభిలాషులకూ అందరికీ నూతన సంవత్సర శుభాకాంక్షలు తెలియజేస్తున్నాం.

సంపాదకుడు : **విశ్వం**







చందమామ

చందా

ఎయిర్‌మెయిల్ ద్వారా అన్నిదేశాలకు
పన్నెండు సంచికలు రూ: 900
ఇండియాలో బుక్‌పోస్ట్ ద్వారా
రూ.180.00
చందా డబ్బు డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారాగానీ, మనిఆర్డర్ ద్వారాగానీ 'చందమామ ఇండియా లిమిటెడ్' పేరిట పంపండి.

**ఉత్తమ లేఖకు బహుమతి!**

'పాఠకుల లేఖలు' శీర్షికలో ప్రచురించబడే ఉత్తమ లేఖకు రూ. 250/- బహుమతి అందజేస్తున్నాం. చందమామలో వెలువడే కథలు, శీర్షికల గురించి పాఠకుల నిర్మాణాత్మక విమర్శలనూ, విలువైన సలహాలనూ ఆహ్వానిస్తున్నాం.
-సం.

**SUBSCRIPTION**

For USA and Canada
Single copy $2
Annual subscription $20
*Remittances in favour of Chandmama India Ltd.* to
Subscription Division
CHANDAMAMA INDIA LIMITED
JVL Plaza, 6th Floor
626(Old 501), Anna Salai
Teynampet, Chennai-600018
Phone : 24334455, 32402323
E-mail :
subscription@chandamama.com



# పాఠకుల లేఖలు

## రూ. 250/- బహుమతి పొందిన లేఖ

గత 50 ఏళ్ళుగా నేను 'చందమామ' నిరంతర పాఠకుడిగా కొనసాగటమేగాక, 30 ఏళ్ళ మా అబ్బాయి, 10 ఏళ్ళ మా మనవడు అంటే మా మూడు తరాలూ 'చందమామ' అభిమాన పాఠకులమేనని సగర్వంగా చెప్పుకుంటున్నాం. తరాలు మారుతున్నా, ఎన్నో వినోద మాధ్యమాలు వస్తున్నా, భారతీయ సంస్కృతీ సంప్రదాయాల విలువలను చాటడంలో 'చందమామ'లో ఎలాంటి మార్పూ లేదు. మురిపించే కథలకు, ముద్దొచ్చే బొమ్మలకు 'చందమామ'కు సాటిలేదనుట అతిశయోక్తి కాదు. ఇది నావంటి వయోవృద్ధ పాఠకులందరి దీర్ఘకాల అనుభవైకవేద్య స్పందన!

నవంబర్ సంచికను స్థూలంగా పరికిస్తే కథల్లో సమకాలీన సమస్యా పరిష్కార సూచి వైఖరి స్ఫురించటం గమనార్హం. 'రాజుగారి కోతి' కథ మూగప్రాణుల రక్షణకు 'పట్టుబడిన పగడాల దొంగలు' కథ పర్యావరణ పరిరక్షణ ఆవశ్యకతకు ఆలంబనలుగా విలిచాయి. ''విశ్వశాంతికి భంగకరమైన ప్రచ్ఛన్న ద్రోహాలను తుదముట్టించాల''ని 25 ఏళ్ళనాడే 'పాతాళ రాక్షసుడు' కథలో హెచ్చరించడం 'చందమామ'కు నాటి నుండేగల 'సమాజ హితైక దృష్టి' సుస్పష్టమగుచున్నది. ''హైందవ సంస్కృతికి మూలపురుషుడు శ్రీరాముడి ఉనికిని సందేహించి వ్యర్థవాదన చేయటం అమానుషం'' అంటూ సునిశిత హెచ్చరికతో కూడిన 'సంపాదకీయం' చందమామకు గల 'భారతీయ సంస్కృతీ విలువల సంరక్షణాస్ఫూర్తి'ని ప్రతిబింబిస్తోంది.

బాలల ప్రశ్నలకు సమాధాన రూపంలో ''ప్రముఖులతో ముఖాముఖీ'' మరియు పాఠకులను 'ఇన్‌వాల్వ్' చేసే ప్రత్యేక శీర్షికలనందిస్తే బాగుంటుందని నా సూచన!

**-గునుపాటి భోగీశ్వరం, రేణిగుంట, చిత్తూరు జిల్లా**

అరవై ఏళ్ళనుంచి చందమామ అందరినీ ఆకట్టుకుంటున్నదంటే ముందుగా సంపాదకులు, అక్కడి ఉద్యోగులు, ముఖ్యంగా కథలను పంపే రచయితలకు ధన్యవాదాలు తెలుపుకుంటున్నాను.

చందమామలోని ప్రతి కథలో ఏదో నీతి కనిపిస్తుంది. ఫలానా కథ బాగుంది అనలేను. ప్రతి పేజీ పిల్లలకు విజ్ఞానదాయకమే. ముఖ్యంగా ప్రాచీన బీర్బల్ కథలలో తీర్పు బాగుంటుంది. ఇక రామాయణం, బేతాళ కథలు ఎంతో ఆసక్తికరం.

చందమామ కబుర్లు, భారతదర్శిని, క్విజ్, వ్యాఖ్యల పోటీ మేధస్సును పెంచుతున్నాయి. అప్పుడప్పుడు పిల్లలకు 'కార్టు కవిత్వం' ప్రవేశపెట్టి వారిలోని పరిజ్ఞానాన్ని వెలికితీయడం బావుంటుందని భావిస్తున్నాను.

**-పులిజాల రవీందర్ రావు, హైదరాబాద్-500 065**



# పరుసవేది

భూషయ్య, రంగమ్మల ఒక్కగానొక్క కొడుకైన చంద్రం చాలా తెలివైనవాడేగాక, చురుకైనవాడు కూడా. తండ్రి భూషయ్య మంచి మనిషిగా పేరుతెచ్చుకున్న బట్టల వ్యాపారి. ఆయన తీసుకున్న కొన్ని నిర్ణయాలు, భాగస్వాముల ద్రోహం కారణంగా వ్యాపారంలో పెద్ద నష్టం వాటిల్లింది. ఆ విచారంతో మంచం పట్టిన భూషయ్య కోలుకోలేక రెండేళ్ళ క్రితం మరణించాడు. మిగిలివున్న కొద్దిపాటి ఆస్తిని, ఆయన చేసిన అప్పులు తీర్చడానికి అమ్మవలసి వచ్చింది. దాంతో మరో మార్గం కనిపించక రంగమ్మ అప్పటి నుంచి బతుకుతెరువు కోసం ధనికుల ఇళ్ళల్లో పాచిపనులు చేయవలసి వచ్చింది. కొడుకు చంద్రాన్ని బాగా చదివించి ప్రయోజకుణ్ణి చేయాలన్నదే ఆమె లక్ష్యం. అయితే, పదమూడవయేట అడుగు పెట్టిన చంద్రానికి తన తల్లి ఇతరుల ఇళ్ళల్లో పనిచేయడం చిన్నతనంగానూ, తీరని అవమానంగానూ తోచింది.

ఈ విషయంగా అతడు తల్లితో తరచూ తగవులాడుతూ, ఆమెకు మనశ్శాంతి లేకుండా చేసేవాడు. తనకు తండ్రిలేకపోవడం, గౌరవంగా బతకడానికి తగినంత డబ్బులేకపోవడం పెద్ద లోటుగా భావించి బాధపడేవాడు. అప్పటికప్పుడు ధనవంతుడై పోవడానికి మార్గమేదైనా ఉందా అని ఎప్పుడూ ఆలోచిస్తూ ఉండేవాడు.

ఇలా ఉండగా ఇనుము, ఇత్తడి వంటి లోహాలను బంగారంగా మార్చవచ్చుననీ, దానిని పరుసవేది అంటారనీ ఆ విద్య బైరాగులకూ, యోగులకూ తెలుసుననీ ఎవరో అనుకుంటూండగా విన్నాడు. ఆ క్షణం నుంచి ఎలాగైనా ఆ పరుసవేది విద్యను నేర్చుకుని తాను అప్పటికప్పుడే ధనవంతుడైపోవాలనే

టి. విశాలాక్షి



కోరిక చంద్రం పసిమనసులో గాఢంగా నాటుకున్నది.

అప్పటి నుంచి ఊరికి ఎవరైనా సాధు సన్యాసులు వస్తే బడి మానేసి వాళ్ళవెంట తిరిగేవాడు. కానీ వాళ్ళెవరూ పరుసవేది తెలిసినవాళ్ళు కారు. కొంతమంది సాధువులు తాము అన్నీ త్యజించినవాళ్ళమనీ తమకు బంగారంతో పని ఏముందనీ ఎదురు ప్రశ్న వేసేవారు చంద్రాన్ని. మరి కొంతమంది అటువంటి విద్యలు లేవనీ, అయినా చిన్న పిల్లలు వాటిని గురించి ఆలోచించకూడదనీ మందలించేవారు. ఎవరెన్ని చెప్పినా చంద్రంలో మార్పురాలేదు. రంగమ్మకు కొడుకు విషయం అంతుపట్టకుండా పోయింది.

ఒకనాడు రాత్రి భోజనానికి కూర్చున్న చంద్రానికి కంచంలో అన్నం పెడుతూ, ''ఈ రోజు బడికి రాలేదని పంతులుగారు చెప్పారు. ఎక్కడికి వెళ్ళావేంటి?'' అని అడిగింది రంగమ్మ. చంద్రం సమాధానం చెప్పకపోయేసరికి, రంగమ్మ మళ్ళీ ఒకసారి అదే ప్రశ్న అడిగింది. దాంతో కోపగించుకున్న చంద్రం చివాలున లేచి, చేయికడుక్కుని ఇంటి నుంచి వెలుపలికి నడిచాడు. ఏం చెప్పడానికీ తోచక రంగమ్మ లోలోపల దిగులుతో కుమిలిపోసాగింది.

చంద్రం కొంతసేపు అటూ ఇటూ తిరిగి, గ్రామదేవత ఆలయం అరుగు మీద పడుకుని, కొంతసేపటికి అలాగే నిద్రపోయాడు. అర్ధరాత్రి సమయంలో ఏవో మాటలు వినిపించడంతో చంద్రం మేలుకుని పక్కకు తిరిగి చూశాడు. ఒక బైరాగి పద్మాసనం వేసుకుని కూర్చుని, ఏవో మంత్రాలు పైకి వినిపించేలా ఉచ్చరిస్తున్నాడు. చంద్రం లేచి మెల్లగా వెళ్ళి ఆయన పక్కన కూర్చున్నాడు. కళ్ళు తెరిచిన బైరాగి, ''నువ్వు చంద్రానివి కదూ,'' అంటూ పలకరించి, వాణ్ణి గురించిన అన్ని విషయాలూ చెప్పాడు. చంద్రానికి ఆశ్చర్యం వేసింది. వాడు అందరు సాధువులను అడిగినట్టే బైరాగిని కూడా, ''మీకు పరుసవేది తెలుసా?'' అని అడిగాడు.

బైరాగి తెలుసు అన్నట్టు తల ఊపాడు. చంద్రానికి పట్టరాని సంతోషం కలిగింది. తాను కూడా వెంటవస్తాననీ, తనకు పరుసవేదిని నేర్పమనీ బైరాగిని ప్రార్థించాడు.

అందుకు బైరాగి, ''నాయనా, చంద్రం! పరుసవేది అంటే రసశిల. అది సోకితే ఏలోహ

మైనా బంగారంగా మారుతుంది. అది రస విద్యకు సంబంధించినది. చాలా రహస్యమైనది. దానిని నీకు నేర్పడానికి నాకెలాంటి అభ్యంతరమూ లేదు. అయితే...'' అంటూ ఆగాడు.

''ఏమిటి స్వామీ?'' అని అడిగాడు చంద్రం.

''ఆ రసవిద్యను సాధించడానికి ఎంతో జ్ఞానమూ, పట్టుదలా కావాలి. చాలా శ్రమించాలి,'' అన్నాడు బైరాగి.

''అందుకు నేనేం చేయాలో సెలవివ్వండి,'' అన్నాడు చంద్రం.

''జ్ఞానార్జనకు చదువు మీద శ్రద్ధ, పట్టుదల పెంచుకోవాలి. అందివచ్చిన ప్రతి మంచి అవకాశాన్నీ శ్రద్ధాసక్తులతో వినియోగించుకోవాలి. నిన్ను నువ్వు తక్కువ చేసుకోకూడదు. అన్నిటికీ మించి అహర్నిశలు నీకోసమే శ్రమిస్తూన్న మీ తల్లికి సాయపడాలి. రసవిద్యను సాధించడానికి ఎన్నో ఆటుపోట్లను తట్టుకోవలసి ఉంటుంది గనక, దీక్షతో శారీరక దారుఢ్యాన్ని కూడా పెంచుకోవాలి. క్రమశిక్షణ కావాలి. నేను ఒక సంవత్సరం తరవాత వచ్చి, నువ్వు సమర్థుడవని అనిపించినప్పుడు నిన్ను వెంటబెట్టుకు వెళ్ళి పరుసవేది విద్యను నేర్పుతాను,'' అని చెప్పి వెళ్ళిపోయాడు బైరాగి.

తెల్లవారేసరికి చంద్రం ఒక నిర్ణయానికి వచ్చాడు. తల్లి వచ్చేసరికి బడికి వెళ్ళడానికి సిద్ధమయ్యాడు. రంగమ్మ ఆనందానికి అవధులు లేవు. చంద్రానికి మొదట్లో కొంచెం కష్టమనిపించినా క్రమక్రమంగా చదువు మీద శ్రద్ధ పెరిగింది. వాడి ధ్యాసంతా చదువు మీదే. తల్లి, బడిపంతులు, సహవిద్యార్థులు అందరూ



అతణ్ణి మెచ్చుకోసాగారు. చంద్రం మనసులో స్వశక్తితో అన్నీ సాధించవచ్చునన్న ఆత్మ విశ్వాసం వేళ్ళూనింది. అతడిప్పుడు ఎంతో సంతోషంగా ఉన్నాడు.

అనుకున్నట్టే సంవత్సరం తిరిగేసరికి ఒక రోజు పట్టపగలే చంద్రం ఇంటికి వచ్చిన బైరాగి, ''పరుసవేది నేర్పుతాను, నాతో రా,'' అన్నాడు.

''నాకిప్పుడు పరుసవేది మీద ఆసక్తిలేదు,'' అన్నాడు చంద్రం వినయంగా.

అయితే బైరాగి, ''ఇంతకాలం నీకోసమే కాచుకున్నాను. ఇప్పుడు రానంటే ఎలా?'' అని గద్దించాడు.

''క్షమించండి. నేను రాలేను,'' అన్నాడు చంద్రం దృఢమైన కంఠస్వరంతో.

బైరాగి మందహాసం చేసి, ''నాయనా చంద్రం! నీలో విద్యార్జన పట్ల శ్రద్ధాసక్తులు పెరిగాయి. ఆత్మవిశ్వాసం ఏర్పడింది. కను కనే పరుసవేదిని వద్దంటున్నావు. నీలో ఇలాంటి మంచి మార్పు రావాలనే, నేను ఆశించాను. విద్యకన్నా మించిన ధనం లేదు. స్వయంకృషితో సాధించుకున్నదాని విలువ చాలా గొప్పది. ప్రతి మనిషిలో మామూలు లోహాల్లా ఎన్నో శక్తులు ప్రకాశించకుండా ఉంటాయి. వాటిలో మంచివాటిని గుర్తించి, సానబెట్టి మెరిసే బంగారంలా చేసుకోవాలి. పట్టుదల ఏకాగ్రత ఉంటే సాధించలేనిది ఏదీ లేదు. నాకు తెలిసిన పరుసవేది అదే. మీ నాన్నగారి బాల్యమిత్రుడిగా నేను నీలో కోరుకున్నది కూడా ఈ మంచి మార్పే. మీ నాన్న బాగా బతికినకాలంలో ఆయన సాయం పొందినవాళ్ళల్లో నేనూ ఒకణ్ణి. గత రెండే ళ్ళుగా నీ ప్రవర్తనను గమనిస్తూ ఉన్నాను. నిన్ను సరైన మార్గంలో పెట్టడం నా బాధ్యతగా భావించి బైరాగి వేషం వేశాను,'' అన్నాడు పెట్టుడుగడ్డాన్నీ, జడలజుట్టునూ తీసి పక్కన పెడుతూ.

చంద్రం ఆనందాశ్చర్యాలతో ఆయనకేసి చూస్తూండగా, అతడి తల్లి లోపలికి వచ్చి, తన బిడ్డను మంచి మార్గంలో పెట్టిన తన భర్త స్నేహితుడు నారాయణకు కృతజ్ఞతతో నమస్కరించింది.





# రాములమ్మ

హఠాత్తుగా భర్త మరణించడంతో రాములమ్మ దిక్కులేనిదయింది. సంతానం లేని రాములమ్మ, తన దగ్గర మిగిలిన కొంచెం డబ్బుతో బతుకుతెరువు కోసం ఉన్న ఊరొదిలి అక్కడికి కొంత దూరానవున్న రామాపురం చేరింది. రామాపురం చిన్న గ్రామం. ఊరి మధ్య చిన్న బడి. ఆ బడి ఎదుట చిన్న బడ్డీకొట్టులో పిల్లలు ఇష్టపడే వేరుశనగలు, బఠానీలు, కొబ్బరి మిఠాయిలు మొదలైన తినుబండారాలు అమ్ముకుంటూ కాలంగడపసాగింది.

అరవైయేళ్ళు దాటిన రాములమ్మ ముగ్గుబుట్టలాంటి తల, నిమ్మపండురంగు శరీరంతో, కీచుమనే కంఠస్వరంతో వింతగా కనిపించేది. ఎవరితోనూ ఎక్కువగా మాట్లాడేది కాదు.

ఆమె ఆ ఊరికి వచ్చిన మూడో నెలకల్లా రామాపురంలో మహమ్మారి సోకింది. పిల్లలకు వాంతులు, విరేచనాలు పట్టుకున్నాయి. పెద్దవారికి విషజ్వరాలు సోకి కొందరు మరణించారు. దీనికంతటికీ కారణం కొత్తగా వచ్చి చేరిన బడ్డీ కొట్టు రాములమ్మే అనీ, ఆ ముసలిది మంత్రగత్తె అనీ రామాపురంలో వదంతి బయలుదేరింది. ఆ వదంతిని పుట్టించింది ముత్యాలమ్మ. బడి పక్కనే చిరుతిళ్ళు అమ్మే అంగడి ఆమెకు ఉన్నది. రాములమ్మ బడ్డీ కొట్టు పెట్టాక ఆమె తయారుచేసే తినుబండారాలు రుచిగా, శుచిగా ఉండడంతో పిల్లలందరూ అక్కడే కొనుక్కోసాగారు. ముత్యాలమ్మ దుకాణం సరిగా సాగడంలేదు. అందువల్ల ఆమె ఎలాగైనా రాములమ్మ అంతుచూడాలని ఆలోచించసాగింది.

ఒకనాడు తమ కష్టాలు తొలగించమని ఊరి జనం గ్రామదేవతకు పొంగళ్ళు పెట్టి ప్రత్యేక పూజలు చేయించారు. అప్పుడు గణాచారికి పూనకం వచ్చి, ''ఒరే, మీ కష్టాలన్నీ ఆ మంత్రగత్తె రాములమ్మవల్లే. అదిఈ ఊళ్ళో ఉండడం అరిష్టం. దాన్ని ఊరి నుంచి

జి.సి. జీవి

తరువుగొట్టండి. మీ రోగాలు తొలగిపో తాయి,'' అని చెప్పాడు.

దాంతో రెచ్చిపోయిన జనం, రాములమ్మ బడ్డీ కొట్టును ధ్వసం చేశారు. ఒకరిద్దరయితే, ఆమె మీదకు రాళ్ళు రువ్వారు. రాములమ్మ కుయ్ కయ్ మనలేదు. తలకు గాయాలై నెత్తురు కారుతున్నా సహించింది. ఆ సమయంలో అటుగా వచ్చిన యువకుడైన బడిపంతులు సూర్యం ఆ దృశ్యాన్ని చూసి జనం మధ్యకు వెళ్ళి, ''ఆగండి. ఏమిటి మీరు చేస్తున్న పని? దిక్కూ మొక్కూ లేని ముసలావిడను అలా కొడుతున్నారెందుకు? ఒక్క నిమిషం ఆగి, నా మాట వినండి,'' అన్నాడు.

''ఏమిటి నీ మాట వినేది? మన బాధలూ రోగాలన్నీ ఎక్కడి నుంచో వచ్చిన ఆ ముసలి మంత్రగత్తెవల్లే. గణాచారి కూడా చెప్పాడు,'' అన్నాడు ఒక వృద్ధుడు.

''ఏమిటీ! ఈ దీనురాలు మంత్రగత్తా? నిజంగా ఆమెకు అంత శక్తే గనక ఉంటే, మీరు కొడుతూ ఉంటే ఊరుకుంటుందా? ఆమె మీది పగకొద్దీ గణాచారికి డబ్బు ఆశ చూపి అలా చెప్పమన్నది ముత్యాలమ్మ. అతనికి ఆమె డబ్బులివ్వడం నేనే చూశాను. అయినా, మన రోగాలకు మూలకారణాన్ని మనమే పెంచిపోషిస్తున్నాం. తాగునీటి కొలనులో గేదెలను కడుగుతున్నాం. దీనికి తోడు ఊళ్ళో చెత్తా చెదారం కుప్పలు కుప్పలుగా పేరుకుపోయాయి. వర్షాకాలం రావడంతో దోమలు, ఈగలు పెరిగి పోయాయి. వాటి ఫలితమే ఈ రోగాలు. అలాగే మూఢనమ్మకాలనే మానసిక కాలుష్యం కూడా మనకు చెప్పరాని కీడు కలిగిస్తుంది. ఈరెండు కాలుష్యాల నుంచి బయటపడితేనే ఆరోగ్యం, అభివృద్ధి సాధ్యం కాగలదు. మొదట మన ఊరిని కలుషిత వాతావరణం నుంచి కాపాడుకుందాం. రోగాలు తప్పక తగ్గుముఖం పడతాయి. ఈ విషయంగా గ్రామాధికారితో మాట్లాడదాం రండి,'' అన్నాడు సూర్యం.

జనానికి అతడి మాటల్లోని నిజం అర్థమయింది. రాములమ్మకు క్షమాపణలు చెప్పుకున్నారు. ఆమె వారికి చేతులెత్తి మొక్కింది. ఆ తరవాత పరిశుభ్రతా చర్యలు చేపట్టడంతో రామాపురంలో రోగాలు క్రమంగా తగ్గుముఖం పట్టాయి.






# రాకాసిలోయ

## 29

[కేశవుడూ అతడి అనుచరులను పట్టుకునేందుకు, బ్రహ్మదండి మాంత్రికుడు స్థూలకాయుడి సాయంతో చేసిన తంత్రం పారింది. బ్రహ్మదండీ, పులుగురాయుడూ తమ అనుచరులతో, కేశవుణ్ణీ అతడి స్నేహితులిద్దర్నీ హఠాత్తుగా చుట్టు ముట్టారు. బ్రహ్మదండి కేశవుణ్ణి ప్రాణాలతో పట్టుకుని, తతిమ్మా ఇద్దర్నీ నిలువునా నరికి వేయమని గట్టిగా కేకపెట్టాడు. -తరవాత]

బ్రహ్మదండి మాంత్రికుడి కేక వింటూనే కేశవుడు, ఆ ధ్వని వచ్చిన వైపుకు తల తిప్పాడు. తనకు అడ్డంగా వున్న రెక్కల మనుషులను పక్కకు తొలగతోస్తూ, మాంత్రికుడు ముందుకు వచ్చాడు. అతడికి ఇరువైపులా జిత, శక్తి వర్మలు కత్తులు దూసి నిలబడి వున్నారు. బ్రహ్మదండిని చూస్తూనే కేశవుడు కళ్ళెర్ర చేసి ముందుకు ఉరకబోయాడు. అంతలో నలుగురైదుగురు రెక్కలమనుషులు అతడి మీద పడి ఆయుధాలన్నీ లాగి వేశారు. ఆ తరవాత జయమల్లూ, కోయగోమాంగ్ కూడా నిరాయుధులుగా చేయబడ్డారు.

నిస్సహాయంగా నిలబడి వున్న ఆ ముగ్గురి కేసీ చూసి, జిత, శక్తివర్మలు వికటంగా ఒక పెద్ద నవ్వు నవ్వి, కత్తులు పైకెత్తుతూ, ''ఆహా, కత్తుల్ని ఇంతకు ముందే బాగా సానపట్టి వుంచటం మంచిదయింది. ఒక్క వేటుతో రెండు తుండేలు చేయగలం!'' అంటూ ముందుకు రాబోయారు. కాని, అంతలో స్థూలకాయుడు తన కొరడాను పైకెత్తి పెద్దగా

'చందమామ'



రంకె పెట్టి, వాళ్ళ కత్తుల్ని కొరడాతో చుట్ట బెడుతూ, ''ఏయ్, జితా, శక్తీ! ఆగండి. వాళ్ళను చంపేందుకు వీలులేదు. వాళ్ళు ఒకప్పుడు నా బానిసలు. అరవై బంగారు కాసుల విలువ చేస్తారు. ఆ డబ్బు ముందు నా కిచ్చి, తరవాత మీ ఇష్టం వచ్చినట్టు చంపు కోండి,'' అన్నాడు.

స్థూలకాయుడి మాటలకు జితవర్మ తోక తొక్కిన తాచులా లేచి, ''ఓయ్, మాంసం పోగూ! ముందు నువ్వు ఆ కొరడాను నా కత్తికి అడ్డం తియ్యి. వాళ్ళిప్పుడు నీ బానిసలు కారు. వాళ్ళ నెప్పుడో అమ్ముకున్నావ్. ఆ కొన్న వర్తకులు చచ్చారు కూడా!'' అన్నాడు.

''ఆ వర్తకులు చచ్చారు గనకే, నా వస్తువులు తిరిగి నా పరం అయినై. నీకీపాటి వ్యవహార జ్ఞానం కూడా లేదా? అయ్యో, అనాగరిక మానవుడా!'' అన్నాడు స్థూలకాయుడు.

జిత, శక్తివర్మలు రెచ్చిపోయి, కత్తులు జార విడిచి స్థూలకాయుడి మీద కలియబడ్డారు. స్థూలకాయుడు వాళ్ళను ఒడుపుగా పట్టుకుని నేలకేసి కొట్టాడు.

అంతవరకూ వినోదం చూస్తున్న వాడిలా నిలబడిన బ్రహ్మదండి మాంత్రికుడు, పులుగురాయుడి కేసి తల తిప్పి, ''పులుగేశా! ఇక మనం చూస్తూ ఊరుకుని లాభంలేదు. ఈ మతిలేని వెధవలు ముగ్గురూ కుక్కల్లా కాట్లాడుకుని, ఆ కేశవుణ్ణి కూడా చంపటమో, లేక వాడు తన అనుచరులతో పారిపోయేందుకు అవకాశం కలిగించటమో చేస్తారు. ముందు ఆ కాట్ల కుక్కల్ని విడదీయండి,'' అన్నాడు.

పులుగురాయుడు తన చేతిలో వున్న ఈటెను పోట్లాడుకుంటున్న వాళ్ళ కేసి గురిపెట్టి, ''జితా, శక్తీ! మీరిక ఆ ఎనుబోతుగాణ్ణి వదలండి. ఈ దొరికిన ముగ్గురూ నా వాళ్ళు. వాళ్ళను పట్టుకున్నది, నేను. తెలిసిందా?'' అన్నాడు రౌద్రంగా.

పులుగురాయుడి హెచ్చరిక వింటూనే జిత, శక్తివర్మలు స్థూలకాయుడి పట్టు విడిపించుకుని, కింద పడి వున్న తమ కత్తుల్ని తీసుకుని, దూరంగాపోయి నిలబడ్డారు.

స్థూలకాయుడు రొప్పుతూ తన కొరడా భుజాన వేసుకుని బ్రహ్మదండి మాంత్రికుడి కేసి గుడ్లురుముతూ చూశాడు.

బ్రహ్మదండి కేశవుణ్ణి సమీపించి అతడి భుజం పట్టుకుని కుదుపుతూ, ''వత్సా, కేశవా! నీ మేలుకోరే నన్ను, నా శిష్యద్రోహి జయమల్లు చెప్పుడు మాటలు విని ఎంత అపార్థం చేసుకున్నావో, ఆలోచిస్తుంటే నా

ఆత్మ గిలగిల కొట్టుకుంటున్నది. నిన్ను కోటీశ్వరుణ్ణి చేయటమేగాక, లోకానికే అధిపతిని చేద్దామనుకున్నాను. ఇది, నా కోర్కె మాత్రమే కాదు; ఆ ఉపాసకుల ఊడల మర్రి కాలభైరవుడి ఆజ్ఞ! ఆ శత్రుల పాలిటి బ్రహ్మజెముడే నిన్ను తిరిగి నా పరం చేశాడు. మన ఇద్దరం ఏకమవటం అంటే అగ్నికి వాయువు తోడైనట్టే. ఆ తరవాత మన దెబ్బకు తిరుగు వుండదు. ఏమంటావ్?'' అని ప్రశ్నించాడు.




బ్రహ్మదండి మాటలు వింటూంటే కేశవుడికి ఒళ్ళు మండిపోయింది. ''బ్రహ్మదండీ, నీ కల్లబొల్లి మాటలు నేను నమ్ముతాననుకోకు. నీవేపాటి మంత్రశక్తి గలవాడవో నాకు తెలుసు!'' అన్నాడు ఉద్రేకంగా.

బ్రహ్మదండి, ''కేశవా, ఈ ఒక్కసారికీ నీ ఈసడింపు మాటలను సహించాను. మరోసారి నా మంత్రశక్తిని కించపరుస్తూ మాట్లాడావో, నిన్ను నిలువునా బూడిద చేసి, దాన్ని శరీరానికి రాసుకుని ఆ కనబడే మొసళ్ళ మడుగులో స్నానం చేసి, నా కాలభైరవుడి దగ్గిరకు వెళ్ళిపోతాను. ఈ జయమల్లు శుంఠకు ఒక్క చారల గాడిద వేషం వేసే మంత్రం తప్ప మరేం తెలుసు?'' అంటూ జయమల్లు కేసి తిరిగి, ''ఈ ద్రోహినీ, ఆ కోయవెధవనూ ఈటెలతో శరీరాలు తూట్లు తూట్లుగా పొడిచి, గద్దలకు ఆహారంగా వెయ్యండి,'' అన్నాడు.

బ్రహ్మదండి మాంత్రికుడు మాట ముగించే లోపలే జిత, శక్తివర్మలు కత్తులెత్తి జయమల్లునూ, కోయగోమాంగ్‌నూ పొడవ బోయేంతలో, పులుగురాయుడు తన ఈటెతో వాళ్ళ కత్తులను కింద పడేలా కొట్టి, ''ఆగండి, ఆగండి! 'గద్దలకు ఆహారం' అన్న మాట వింటూనే నాకో ఆలోచన వచ్చింది. వీళ్ళిద్దరి రూపురేఖలూ చూస్తూంటే వీళ్ళు గద్ద జాతి మానవుల్లా కనిపిస్తున్నారు. మా గరుడజాతి వాళ్ళకు, గద్దజాతి వాళ్ళు సర్వ కాలాల్లో సేవకావృత్తి చేసి బతకాలని శాస్త్రం వున్నట్టు విన్నాను. కనక, వీళ్ళిద్దరూ నా సేవకులు,'' అంటూ తన అనుచరుల కేసి తిరిగి, ''ఒరేయ్, వీళ్ళను నా గృహానికి తీసుకు వెళ్ళండి. నా ఉడుపులూ అవీ చెదలు పట్టకుండా దులిపి ఎండవేసే పని నేర్పండి. వాళ్ళు పారిపోయారో, మీ ప్రాణాలు తీస్తాను,'' అన్నాడు.

పులుగురాయుడి అనుచరులు జయమల్లునూ, కోయగోమాంగ్‌నూ భుజాలు పట్టుకుని ఈడ్చుకు పోబోయేంతలో, బ్రహ్మదండి వాళ్ళకు అడ్డుపడి, పులుగురాయు



డితో, ''పులుగు ప్రభో! మీరు అతిగా తొందర పడకండి. వీళ్ళ సంగతి మీకు ఆవగింజంత కూడా తెలీదు. వీళ్ళు పారిపోతారనే భయం మీ కొద్దు. వాళ్ళు పారిపోదలిస్తే, మీ ప్రాణాలు తీసిం తరవాతే పారిపోతారు. నా మాట విని, వీళ్ళ నిక్కడే ముక్కలు ముక్కలుగా నరికించి కాకులకు మేతగా వేయండి,'' అన్నాడు.

బ్రహ్మదండి ఇలా అనగానే పులుగు రాయుడు చీదరించుకుంటున్న వాడిలా ముఖం పెట్టి, ''ఏం, బ్రహ్మదండీ! ప్రతి స్వల్పానికీ నువ్వు కనబరచే భయం, చేసే గోలా చూస్తూంటే, నువ్వు కాకి జాతి మానవుడిలా కనిపిస్తున్నావు. గద్ద జాతి మానవులకు, కాకి జాతి మానవులు ఊడిగం చేస్తూ జీవించాలని శాస్త్ర పుస్తకాల్లో వుంది. కనక నిన్ను ఈ ఇద్దరికీ సేవకుడిగా నియమిస్తున్నాను,'' అన్నాడు.

పులుగురాయుడి మాటలతో బ్రహ్మదండి శివమెత్తిన వాడిలా అయిపోయి, మంత్ర దండాన్ని గిర్రున తిప్పుతూ, ''పులుగు దొరా, ఈ కాలభైరవోపాసకుణ్ణి ఎంత మాటన్నారు! సరే, నేను నా కేశవుణ్ణి వెంటబెట్టుకుని రాకాసిలోయకు వెళ్ళిపోతాను. మీకు వాగ్దానం చేసిన విధంగా, మీ దేవతకు బలి మనుషుల్ని తప్పక పంపుతాను. రేపు సూర్యోదయంతోనే, నా ప్రయాణం,'' అన్నాడు.

''అందుకు నా అభ్యంతరం ఏమీ లేదు. ఇక కదలండి,'' అంటూ పులుగురాయుడు బయలుదేరాడు. అతడి వెంట అందరూ కదిలారు. కేశవుణ్ణీ, జయమల్లునూ, కోయ గోమాంగ్‌నూ పది మంది రెక్కల మనుషులు ముందూ వెనకా కాపుండి నడిపించారు. బ్రహ్మదండి, స్థూలకాయుడికి సౌంజ్ఞ చేసి గుంపు నుంచి పక్కకు తీసుకుపోయి రహస్యంగా, ''వీర చూడామణీ! నేచెప్పేది శ్రద్ధగా విను. ఇక మనం ఈ పక్షి ముఖం వెధవ దగ్గిర వుండటం ప్రమాదకరం. రేపు తెల్లవారుతూనే, నేనూ, జిత, శక్తివర్మలూ, నువ్వూ కలిసి, ఆ కేశవుణ్ణి తీసుకుని రాకాసిలోయకు వెళ్ళిపోదాం. ఆ కేశవుడు పారిపోకుండా జాగ్రత్త పడ్డామంటే, రాకాసిలోయలోని ధనరాసులన్నీ మనవే. వాడు వెంట లేకుండా అక్కడ మనం గుడ్డిగవ్వకు కొరగాం. అదీ సంగతి,'' అన్నాడు.

''ఆ వెధవ కుర్రకుంకను గురించి నువ్వంతగా వాపోవటం ఏం బాగా లేదు. నా లెక్కన వాడు ఇరవై బంగారు కాసులకన్న ఎక్కువ విలువ చెయ్యడు,'' అన్నాడు స్థూలకాయుడు పెదాలు చప్పరిస్తూ.

‘‘అన్నన్నా, ఎంత మాట! ఆ కేశవుడు సామాన్యుడనుకున్నావా? వాడు రాజయోగాన్ని భుజాన వేసుకుని పుట్టాడు. వాడి మూపు మీద పడగ విప్పిన పాము ఆకారం గల మచ్చ చూస్తే, నువ్విలా మాట్లాడవు. దాన్ని స్వయంగా ఆ కాలభైరవుడే అచ్చుగుద్దాడు, తెలిసిందా?’’ అంటూ బ్రహ్మదండి మాంత్రికుడు చెంపలు వేసుకున్నాడు.

‘‘వాడు బ్రహ్మపురానికి రాజైన నాడు గాని, నువ్వు చెప్పేది నేను నమ్మను. ఏదెలా అయితే నాకేం? నాకు చేసిన వాగ్దానం మాట మరవకు,’’ అన్నాడు స్థూలకాయుడు.

బ్రహ్మదండీ, స్థూలకాయుడూ మాట్లాడుకోవటాన్నేగాక, అంతకు ముందు జరిగిన సంఘటనలన్నీ కూడా బిడాలి, శ్వానకర్ణి నియమించిన వేగుల వాళ్ళు, కొండ రాళ్ళ చాటు నుంచి గమనించారు. వాళ్ళు కేశవుడూ, అతడి అనుచరులూ పులుగురాయుడికి పట్టు బడటం దగ్గిర నుంచి సర్వం తమ నాయకులకు తెలియపరుస్తూనే వున్నారు.

కేశవుడూ వాళ్ళు గుహలో ప్రవేశించిన తరవాత నిప్పులు కక్కే సింహం పారిపోవటాన్ని గురించి విన్న బిడాలీ, శ్వానకర్ణీ ఇక తమకు వచ్చిన ప్రమాదం ఏమీ లేదని నిశ్చయించుకుని, గుహలో ప్రవేశించి, కోయగోమాంగ్ వదిలిపోయిన రాతి గదను చూశారు. ఆ తరవాత వాళ్ళు కాలి గుర్తులను అనుసరిస్తూ నడిచి, సొరంగం పైన వున్న కంత నుంచి బయట జరుగుతున్నదంతా గమనించారు.

‘‘ఇంత మంది దుర్మార్గుల్ని వాళ్ళ స్వస్థలంలో ఎదిరించి గెలవటం కష్టం. పైగా, ఈ



లోపల వాళ్ళు కేశవుణ్ణీ, అతడి స్నేహితులనూ చంప వచ్చు,’’ అన్నాడు బిడాలి.

శ్వానకర్ణి తన మూలపురుషుడి రాతి గదను కళ్ళకద్దుకుని, ‘‘ఇక, నా ముఠాకు అపజయ భయం లేదు. మన మిత్రులైన ఆ ముగ్గుర్నీ రక్షించే భారం నాది. తరవాత, వాళ్ళ సాయం కూడా తీసుకుని, మొత్తం ఈ రెక్కల పక్షి గాళ్ళను దుంపనాశం చేస్తాను,’’ అన్నాడు.

‘‘వాళ్ళను రక్షించే భారం నా మీద కూడా కొంత వున్నది. రెక్కల మనుషుల దేవతకు బలికానున్న నా ముఠావాళ్ళను ఆ ముగ్గురూ రక్షించారు. ఇంతకూ నీ ఆలోచన ఏమిటి?’’ అని అడిగాడు బిడాలి.

బిడాలి అలా ప్రశ్నించగానే శ్వానకర్ణి తల పంకిస్తూ కాసేపు వూరుకుని, తరవాత అంత దూరంలో వున్న తన ముఠా వాళ్ళలో ఇద్దర్ని దగ్గిరకు పిలిచి, ‘‘మీరు చీకటి పడుతూనే,

పక్షి రెక్కలు తగిలించుకుని, రెక్కల మనుషుల్లా నటిస్తూ, పులుగురాయుడు నివసించే ప్రాంతాలకు వెళ్ళి, కేశవుడూ వాళ్ళ స్థితి ఎలా వున్నదో తెలుసుకు రావాలి,'' అని ఆజ్ఞాపించాడు.

''ఎత్తుగడ బాగానే వుంది. నీ ముఠా వాణ్ణొకణ్ణీ, నా ముఠావాణ్ణొకణ్ణీ పంపుదాం. అది న్యాయంగా వుంటుంది,'' అన్నాడు బిడాలి. ఇందుకు శ్వానకర్ణి అంగీకరించాడు.

తరవాత కొంతసేపటికి సూర్యాస్తమానమై క్రమంగా చీకటి పడింది. శ్వానకర్ణి బిడాలి ముఠాల అడవిమనుషులిద్దరూ సొరంగాన్నుంచి బయిటికి పాకిపోయి, అక్కడ పడివున్న పక్షి రెక్కల్లో తమకు కావలసినవి ఏరుకుని, చేతులకు తగిలించుకుని పులుగురాయుడు నివసించే ప్రాంతాలకు వెళ్ళారు.

దారిలో ఆ ఇద్దర్నీ ఎవరూ అనుమానించి అటకాయించ లేదు. వాళ్ళు ఒక్కొక్క గుడారాన్నే దాటిపోతూ, చివరకు బ్రహ్మాదండీ, స్థూలకాయుడూ వున్న గుడారం ముందు నుంచి వెళ్ళేటప్పుడు, కాగడాల వెలుగులో వాళ్ళిద్దర్నీ గుర్తించి, ఆ పక్కనే కేశవుడూ అతడి అనుచరులుండవచ్చని ఊహించారు. తరవాత నాలుగడుగులు ముందుకు వెళ్ళే సరికి వాళ్ళు ఊహించినది నిజమని తేలిపోయింది. ఒక గుడారం ముందు జిత, శక్తివర్మలు కత్తులు పట్టుకుని కాపలా కాస్తున్నారు. లోపల కేశవుడూ, జయమల్లూ, కోయ గోమాంగ్ చాపల మీద కూచుని మాట్లాడుకుంటున్నారు.

అడవిమనుషులిద్దరూ జంటగా జిత, శక్తివర్మలను సమీపించి, ''దారి తొలగండి! లోపల వున్న ఆ ముగ్గురు దుర్మార్గుల్నీ తన వద్దకు తీసుకు రమ్మని పులుగుదొర ఆజ్ఞ అయింది,'' అన్నారు.

జిత, శక్తివర్మలు దారి ఇచ్చారు. కాని, అంతలో జితవర్మ కేదో అనుమానం తగిలి, ''వీళ్ళు రెక్కల మనుషుల జాతి వాళ్ళలా లేరు, అడవి మనుషుల ముఖలక్షణాలు కనబడుతున్నవి,'' అన్నాడు.

''అవునవును, నాకూ అదే అనుమానం కలిగింది, సుమా!'' అంటూ శక్తివర్మ కత్తి దూసి, ''ఏయ్, మీరెవరు? ఆగండి!'' అంటూ ముందుకు వెళ్ళాడు. -(ఇంకావుంది)





# నమ్మలేని నిజాలు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, భీతికొలిపే అర్ధరాత్రి వేళ నువ్వు పడుతూన్న కఠోర శ్రమ చూస్తూంటే సాధారణ లక్ష్య సాధనకు కాకుండా, ఏదో మహాద్భుత రహస్యాన్ని ఛేదించి లోకోత్తర సత్యాన్ని కనుగొన డానికి సంకల్పించినట్టు కనిపిస్తున్నది. అయితే, కొందరు ఒక్కొక్కసారి అసా ధారణమైన అద్భుతాలను ఉదాసీన పరచి, సాధారణ విషయాలను మహత్తర సత్యాలుగా పొగుడుతూ ఉంటారు. విదర్భరాజు యశోధర వర్మకూడా అటువంటి పొరబాటే చేశాడు. నీకు ఉపయోగకరంగా ఉండగలందులకు ఆయన కథ

బేతాళ కథలు



చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

విదర్భరాజు యశోధరవర్మ ఆదర్శపాలకుడుగా పేరుపొందాడుగాని, ఆయనకు బాల్యం నుంచే వినోదాల పట్ల కాస్త ఆసక్తి ఎక్కువ. శత్రురాజుల భయం, కరువుకాటకాల బెడద లేకుండా రాజ్యం సుభిక్షంగా ఉండడంతో, రాజు దృష్టి వినోదాలవైపు మళ్ళింది. అందువల్ల పాలనా బాధ్యతలు, సమర్థులని భావించిన కొంత మంది మంత్రులకు అప్పగించి తాను వినోద కార్యక్రమాలతో కాలక్షేపంచేయసాగాడు. మంత్రులు తరచూ రాజును కలిసి రాజ్య పరిస్థితులు సక్రమంగా ఉన్నాయని చెప్పేవారు. రాజు వారి మాటలను నమ్మి వారిని అభినందించి పంపేవాడు. ఇలా కొంత కాలం గడిచింది.

రాజు యశోధరవర్మ ఒకనాడు-ఒక కవి మహాభారతంలోని రాజసూయ యాగ ఘట్టంలో వింతలు నిండిన విచిత్రమైన మయసభ గురించీ, దుర్యోధనుడు అందులో ప్రవేశించి పడ్డపాట్ల గురించీ వినోదాత్మకంగా వర్ణించి రాగయుక్తంగా ఆలపించడం వినగానే, ఆయనకు ఒక వింత ఆలోచన వచ్చింది. వెంటనే మంత్రులను పిలిచి వచ్చే పౌర్ణమి రోజున తాను కొలువు తీరుతాననీ, ఆ రోజున ప్రజలు సభకు వచ్చి, తమకు తెలిసిన నమ్మలేని నిజాలు చెప్పి, రుజువులు చూపిస్తే, విలువైన కానుకలతో సత్కరిస్తాననీ చాటింపు వేయమన్నాడు.

ఆ ప్రకారం రాజ్యంలో చాటింపు వేయబడింది. పౌర్ణమినాడు యశోధరవర్మ కొలువు తీరాడు. నమ్మలేని నిజాలు వినాలన్న కుతూహలంతో పలువురు నగర ప్రముఖుల రాకతో సభ కిటకిటలాడసాగింది. అప్పుడు యశోధరవర్మ, ''మీకు తెలిసిన నమ్మలేని నిజాలు రుజువు పరచి, విలువైన కానుకలు పొందండి,'' అన్నాడు ఉత్సాహంగా.

గోపయ్య అనే రైతు లేచి రాజుకు నమస్కరించి, ఒక కొయ్యపెట్టెను చూపుతూ, ''మహారాజా, కొన్ని సంవత్సరాలక్రితం నేను పొలం దున్నుతూ ఉండగా ఒక చిన్న చెక్కపెట్టె నాగటి కర్రుకు తగిలింది. అందులో ఏదో నిధి ఉంటుందని ఆశగా తెరిచి చూశాను. కాని అందులో చిన్న నల్లటి రాయి కనిపించింది. పెట్టె తెరిచినంతనే పట్టపగలే ఆ ప్రాంతమంతటినీ చిమ్మచీకటి ఆవరించింది.

విస్తుపోయి, భయంతో పెట్టె మూసినంతనే చీకటి మటుమాయమై వెలుగువచ్చింది. దానినిబట్టి పెట్టెలో ఉన్నది చీకటిరాయి అని గ్రహించాను. అది ఎల్లప్పుడూ చీకటిని చిమ్ముతూ ఉంటుంది. అదే ఇది,'' అని చెప్పాడు.

గోపయ్య నుంచి చెక్కపెట్టెను అందుకున్న రాజు దానిని తెరిచాడు. మరుక్షణం సభామంటపమంతా గాఢాంధకారం అలముకున్నది. భటులు కాగడాలు వెలిగించారు. రాజు పెట్టెమూత మూశాడు. చీకటి అంతరించి వెలుతురు వచ్చింది. ''ఆహా! ఈ చీకటిరాయి నమ్మలేని నిజం,'' అంటూ యశోధరవర్మ, గోపయ్యకు వెయ్యి బంగారు నాణాలు కానుకగా ఇచ్చాడు.

ఆ తరవాత రత్నాకరుడనే వ్యాపారి లేచి నిలబడి రాజుకు వంగి నమస్కరించి, ''మహాప్రభూ, ఒక వెన్నెల రాత్రి నేను, మా ఇంటి వెనక ఉన్న తోటలో తిరుగుతూండగా ఒక అద్భుతం చూశాను. ఆకాశంలో రెక్కలగుర్రం మీద ఒక దివ్యపురుషుడూ, స్త్రీ వెళుతున్నారు. వేగంగా వెళుతూన్న వారి దగ్గరినుంచి ఒక పుష్పం జారి మా తోటలో పడింది. మరుక్షణమే ఒక విధమైన దివ్యపరిమళం తోటంతా వ్యాపించింది. ఆనందాశ్చర్యాలతో ఆ పుష్పాన్ని తీసుకుని పూజాగృహంలో ఉంచాను. ఆ తరవాత తెలిసిన నిజం ఏమంటే – ఆ పుష్పం ఎన్నటికీ వాడలేదు. దాని సువాసన కూడా ఏ మాత్రం తగ్గలేదు,'' అంటూ తన చేతిలోని దంతపు భరిణను రాజుకు ఇచ్చాడు.



రాజు భరిణను తెరిచి చూశాడు. అందులో అప్పుడే వికసించినట్టు ఒక పుష్పం నవనవలాడుతూ కనిపించింది. దాని దివ్య పరిమళం సభామంటపమంతా వ్యాపించింది.

''ఇటువంటి దివ్యపుష్పాల గురించి కథల్లో వినడమేగాని, ఎన్నడూ చూడలేదు. ఇదీ నమ్మలేని నిజమే,'' అంటూ రాజు రత్నాకరుడికి ముత్యాల హారాన్ని కానుకగా ఇచ్చాడు.

ఆ పిమ్మట మహాయజ్ఞుడనే పండితుడు లేచి, ''ప్రభూ, నా వద్ద ఒక పురాతనమైన నాణెం ఉన్నది. దాన్ని తాకితే చాలు. మరిచిపోయిన విషయాలన్నీ జ్ఞాపకం వస్తాయి,'' అంటూ ఒక నాణాన్ని రాజుకు ఇచ్చాడు.

దాన్ని తాకగానే రాజుకు గతంలో మరిచిపోయిన విషయాలన్నీ ఒక్కసారిగా జ్ఞప్తికి



దగ్గరి నుంచీ కాపలాభటులు మనిషికి పది వరహాల చొప్పున లంచం పుచ్చుకుని లోపలికి పంపారు. నేనూ అలాగే ఇచ్చి వచ్చాను. అందుకే దాన్ని సింహద్వారంగా కాకుండా లంచద్వారంగా భావించాను,'' అన్నాడు శివదత్తుడు.

''కాపలాభటులు లంచం తీసుకోవడమా? నేను నమ్మను,'' అన్నాడు రాజు.

''తమరు నమ్మరు గనకే, అది నమ్మలేని నిజం అయింది మహారాజా! ఇదొక్కటే కాదు. మన రాజ్యంలో లంచద్వారాలు ఇంకా చాలా ఉన్నాయి. మీరు నమ్మకంతో పాలనా బాధ్యతలు అప్పగించిన మంత్రులు కొందరు స్వార్థంతో పన్నుల రూపంలో ప్రజలను దోచు కుంటున్నారు. రాజోద్యోగులు లంచగొండు లుగా మారిపోయారు. మీరు నమ్మలేని ఈ నిజాలను మీ చెవిని వేయడానికే నేను లంచం ఇచ్చి వచ్చాను. కానుకల కోసం కాదు,'' అన్నాడు శివదత్తుడు గంభీరంగా.

ఆ మాట విని రాజు ఉలిక్కిపడ్డాడు. మరు క్షణమే తేరుకుని అద్భుత వస్తువులను తెచ్చిన రైతు, వ్యాపారి, పండితుడు మొదలైన వాళ్ళ కేసి చూశాడు. వాళ్ళందరూ శివదత్తుడి మాటలు వాస్తవమే అన్నట్టు తలలూపారు. మంత్రులు, ఉన్నతోద్యోగుల కేసి రాజు చూశాడు. అపరాధభావంతో వారిలో పలు వురు తలలు దించుకున్నారు. ఆ తరవాత రాజు మౌనంగా తలపంకించి, సింహాసనం నుంచి లేచి శివదత్తుడి వద్దకు వెళ్ళి, ''నువ్వు చెప్పిందే అన్నిటి కన్నా గొప్ప నమ్మలేని నిజం.

వచ్చాయి. రాజు సంతోషించి మహాయజ్ఞుడికి బంగారు నాణాలు కానుకగా ఇచ్చాడు.

కొంతసేపు సభలో నిశ్శబ్దం నెలకొన్నది. అప్పుడు శివదత్తుడనే యువకుడు లేచి, ''మహారాజా, నేను ఈ సభామంటపానికి సింహద్వారం గుండా రాలేదు. మరెలా వచ్చానో చెప్పగలరా?'' అని అడిగాడు.

''ఎలా వచ్చావు?'' అని అడిగాడు రాజు కుతూహలంగా.

''లంచద్వారం గుండా వచ్చాను,'' అన్నాడు శివదత్తుడు చిన్నగా నవ్వుతూ.

''లంచద్వారమా? అదెక్కడ ఉన్నది?'' అంటూ ఆశ్చర్యపోయాడు రాజు.

''మహారాజా, నమ్మలేని నిజాలు చెప్పి తమనుంచి కానుకలు అందుకోవడానికి పలువురు మంటపానికి వచ్చారు. వారందరి

నీకు సమ్మతమైతే నిన్ను నా సలహాదారుగా నియమించుకుంటాను,'' అంటూ తన మెడలోని మణిహారాన్ని తీసి అతనికి బహూకరించాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, నమ్మలేని నిజాలు చెప్పి రుజువులు చూపిస్తే, విలువైన కానుకలతో సత్కరిస్తానని ప్రకటించిన రాజు - అద్భుతమైన చీకటిరాయినీ, దివ్య పుష్పాన్నీ, స్మృతినాణాన్నీ తెచ్చిన రైతునూ, వ్యాపారినీ, పండితుణ్ణీ వదిలి; మామూలు వాస్తవాన్ని తన దృష్టికి తీసుకువచ్చిన శివదత్తుణ్ణి గొప్పగా ప్రశంసించడంలో గల ఆంతర్యం ఏమిటి? అతడు చెప్పిన వాస్తవాలలో నమ్మలేనివంటూ ఏమున్నది? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీతల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''ఆ ముగ్గురు చూపినవి నిజంగా అద్భుతమైన వస్తువులే. అయితే, శివదత్తుడు చెప్పిన వాస్తవమే గొప్ప నమ్మలేని నిజం. ఎందుకంటే రాజు నమ్మకస్థులని నమ్మిన మంత్రులు దానికి విరుద్ధంగా స్వార్థంతో ప్రవర్తించడంతో, అంతా సవ్యంగా సాగిపోతున్నదని నమ్మిన రాజుకు ఏ ఒక్కటీ సక్రమంగా లేకపోవడం-దిగ్భ్రాంతి కలిగించిన నమ్మలేని నిజం! నమ్మకూడని వారిని నమ్మడం అనేక అనర్థాలకు దారితీస్తుంది. పాలకులు అలా నమ్మితే ప్రజాక్షేమానికే భంగం వాటిల్లుతుంది. నమ్మలేని నిజాల పేరిట వాస్తవ పరిస్థితులను రాజుకు విశదపరచిన శివదత్తుడు నిజాయితీపరుడు, ధైర్యశాలి, అన్నిటికీ మించి ప్రజాక్షేమం పట్ల శ్రద్ధ కలవాడు. అందుకే రాజ్యంలో జరుగుతూన్న అన్యాయాలను తెలివిగా తెలియజేసి రాజుకు కనువిప్పు కలిగించాడు. ఈ కారణాలవల్లే రాజు యశోధర వర్మ అతన్ని మణిహారంతో సత్కరించడమే గాక, తన సలహాదారుగా నియమించుకోవాలని నిర్ణయించాడు,'' అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. - (కల్పితం)

[ఆధారం : ఎన్. శివనాగేశ్వరరావు రచన]





అగ్రశ్రేణి కథారచయితలలో మున్నెన్న తగిన సుప్రసిద్ధ తమిళ సాహితీవేత్త జయకాంతన్ 1934వ సం.లో జన్మించారు. ఆయన పదహారవ యేటనే తొలి కథను రచించారు. ఇరవైయేళ్ళ తరవాత 'సిలనేరంగళిల్ సిలమని దర్‌గళ్' అనే ఆయన నవలకు సాహిత్య అకాడెమీ అవార్డు లభించింది. రెండుసార్లు ఉత్తమ కథారచయితగా తమిళనాడు ప్రభుత్వ బహుమతులు అందుకున్నారు. 1995వ సం.లో సాహిత్య అకాడెమీ ఫెలోషిప్‌తో గౌరవించబడ్డారు. 2005లో జ్ఞానపీఠ పురస్కారంతో సత్కరించబడ్డారు. 15 నవలలు, 35 నవలికలు, 16 సంకలనాలుగా వెలువడ్డ దాదాపు 160 కథలు, వివిధ విషయాలపై అసంఖ్యాకమైన వ్యాసాలు ఆయన రచించారు. ఆయన రచనలు వివిధ భారతీయ భాషలలోకి మాత్రమే కాకుండా ఇంగ్లీష్, జర్మన్, రష్యన్, ఉక్రేనియన్, జాపనీస్ మొదలైన భాషలలోకి అనువదించబడ్డాయి.

# తాతయ్య-బామ్మ చెప్పిన కథ

**నా**కు ఇష్టమైన చాలా కథలు మా తాతయ్య-బామ్మ చెప్పగా విన్నాను. ''అదెలా సాధ్యం? ఒకే కథను ఇద్దరు ఎలా చెప్పారు?'' అని మీకు అడగాలనిపిస్తున్నది కదూ? చెబుతాను వినండి....

అది పాతకాలపు ఇంటి వాకిలి. చల్లని వెన్నెల రాత్రి. తాతయ్య నవారు మంచం మీద పడుకునేవాడు. నాలాంటి నలుగురైదుగురు పిల్లలు ఆయన చుట్టూ కూర్చునే వాళ్ళం. బామ్మ పళ్ళెంలో అన్నం కలిపి ముద్దలు చేసి పిల్లల చేతుల్లో పెట్టేది. తాతయ్య కథలు చెప్పేవాడు. ఎందుకో తెలుసా? మాచేత అన్నం తినిపించడానికి; అన్నం ముద్దలకు మరింత రుచి కలిగించడానికి!

కథ వింటూ గొడవ చేయకుండా పిల్లలు తిని ముగించేంతవరకు కథ చెప్పడం కొనసాగేది. ఖాళీ పళ్ళెంతో బామ్మ అక్కడి నుంచి లేవగానే తాతయ్య అలిసిపోయేవాడు! ఒక్కొక్కసారి అలాగే నిద్రపోయేవాడు. ఒక్కొక్కసారి, ''అలిసిపోయానర్రా, నిద్రవస్తోంది, మిగిలిన కథ రేపు చెబుతాను,'' అనేవాడు. ''వీలుకాదు. ఇప్పుడే మొత్తం కథ చెప్పాలి,'' అని పిల్లలు మారాం చేసేవారు.

''వెళ్ళి మీ బామ్మను మిగిలిన కథ చెప్పమని అడగండి,'' అంటూ తాతయ్య నిద్రకు ఉపక్రమించేవాడు. పిల్లలు వెళ్ళి, ''బామ్మా, బామ్మా, మిగిలిన కథ చెప్పవూ,'' అంటూ బామ్మను పీడించేవారు.

''మీ తాతయ్య అంతబాగా కథలు చెప్పడం నాకు చేతకాదు కదా. అయినా నాకు తెలిసిన మటుకు చెబుతాను,'' అంటూ బామ్మ మిగిలిన కథను కొనసాగించేది. అందువల్ల, ఈ కథ తాతయ్య చెప్పిందా? బామ్మ చెప్పిందా అన్నది

నాకిప్పుడు స్పష్టంగా జ్ఞాపకం లేదు. ఈ కథను తలుచుకున్నప్పుడల్లా నాకు తాతయ్య కంఠ స్వరమూ, బామ్మ గొంతూ రెండూ వినిపిస్తాయి.

''బామ్మా, నీకీ కథ ఎలా తెలుసు?'' అని మేము అడిగితే, ''దీన్ని నాకు మా తాతయ్య, బామ్మ చెప్పారు,'' అని చెప్పేది బామ్మ.

అంటే చాలామంది తాతయ్యలూ, బామ్మలూ ఈ కథను చాలామంది తాతయ్యలకూ, బామ్మలకూ చెప్పారన్నమాట!

సరే, ఇప్పుడు నేను కూడా నాకు తెలిసినట్టు మీకా కథ చెబుతాను.

అదొక దొంగ కథ!

సాధారణంగా పిల్లలకు దొంగల కథలూ, దయ్యాల కథలూ, రాక్షసుల కథలూ, భూతాల కథలూ అంటే చాలా ఇష్టం కదా?

మనం అతణ్ణి అగౌరవంగా దొంగ అని చెప్పకూడదు. గౌరవనీయమైన దొంగ, లేదా దొంగగారు అనే చెప్పాలి. లేకుంటే ఆ దొంగ మన చుట్టుపక్కల దాక్కుని వుండి వింటే మన గతి ఏమవుతుంది?

సరే, ఇప్పుడు అసలు కథ వినండి. నాకు ఆ కథ ఇప్పటికీ మా తాతయ్య, బామ్మ కంఠ స్వరాల్లో వినిపిస్తూనే ఉన్నది. మామూలుగా కథలనగానే పిల్లల మనసుల్లో పలు దృశ్యాలుగానే కనిపిస్తాయి. అలాంటి కొన్ని దృశ్యాలనే నేనిప్పుడు జ్ఞాపకం ఉంచుకోగలుగుతున్నాను.

దృశ్యం - 1

అదొక అడవి. దానికి ఆవల విశాలమైన ఇసుక ప్రదేశం. ఎడారిలా ఎండిపోయిన నది ఇసుక మేటలు. ఎండ తీవ్రంగా కాస్తోంది. ఇద్దరు వ్యక్తులు ఒక తల్లి, తండ్రి. తల్లి చేతిలో పుట్టి కొన్నాళ్ళే అయిన చంటిబిడ్డ. వాళ్ళా వేడి ఇసుక ప్రాంతాన్ని దాటాలని కష్టపడి నడుస్తున్నారు. హఠాత్తుగా ఎటు నుంచో వచ్చిన ఒక కొండడేగ వాళ్ళ మీదుగా ఎగరసాగింది. ఆకాశాన్ని నల్లటి మేఘాలు ఆవరించాయి. క్షణంలో డేగ కిందికి వాలి తల్లి చేతిలోని బిడ్డను తన్నుకుపోయింది. తల్లి అకాశం కేసి చూస్తూ, ''అయ్యో! నా బిడ్డ,'' అని విలపిస్తూ ఇసుకలో కుప్పకూలిపోయింది. దీనిని చూసి తండ్రి అరుస్తూ కొంత దూరం డేగవెంట పరిగెత్తి నేలపై తూలిపడ్డాడు.



ఏడుస్తూన్న శిశువును పదునైన గోళ్ళతో పట్టుకుని డేగ ఆకాశానికి ఎగిరిపోయింది.



పోయారు. బిడ్డ ముఖంలో దివ్యతేజస్సు కనిపించింది. రక్షకుడని పేరుపెట్టి రాజకుమారుడిలా పెంచసాగారు. రక్షకుడు గొప్ప విలుకాడుగా పెరిగి యుక్తవయస్కుడయ్యాడు.

అతణ్ణి చూసి మనసులో ఎంతో గర్వ పడిన వేటగాళ్ళ నాయకుడు, ''నాయనా! నిన్ను కన్న వాళ్ళెవరో నాకు తెలియదు. నీ ముఖంలో దివ్య తేజస్సు ఉట్టిపడుతున్నది. నా తరవాత నువ్వే మన తెగకు నాయకత్వం వహించాలి. మన జీవితం కేవలం వేటకు మాత్రమే పరిమితం కాదు. ఒక్కొక్కసారి దారి దోపిడీ చేయవలసి ఉంటుంది. దొంగతనాలకు వెళ్ళవలసి ఉంటుంది. అది తరతరాలుగా వస్తూన్న మన వృత్తి. విలువిద్యలో నువ్వు ఆరితేరావు. ఇకపై చోరకళను కూడా నేర్చుకోవాలి. అది మన సంప్రదాయ వృత్తి. అయితే, నువ్వు ఎలాంటి పరిస్థితులలోనూ అబద్ధం అన్నది చెప్పకూడదు. అబద్ధ మాడడం ఏ ధర్మానికీ ఆమోదయోగ్యం కాదు,'' అన్నాడు.

''దొంగతనం మన సంప్రదాయవృత్తి గనక, దాన్ని నేను తప్పక చేపడతాను,'' అంటూ తండ్రి మాటను అంగీకరించిన రక్షకుడు, ''నేనెప్పుడూ అబద్ధం చెప్పను,'' అని కూడా తండ్రికి మాట ఇచ్చాడు.

కొన్నాళ్ళకు రక్షకుడు భయంకరమైన బందిపోటుగా తయారయ్యాడు. వాడి పేరు వినగానే ప్రజలు గడగడలాడసాగారు.

దృశ్యం - 2

దాపులనున్న మరొక అడవి. అక్కడ వేటాడుతూన్న వేటగాళ్ళకు ఆకాశంలో పసిబిడ్డ ఏడుపు వినిపించింది. తలెత్తి చూసిన వేటగాళ్ళు, ఒక డేగ బిడ్డను తన్నుకుపోతూండడం చూసి ఆశ్చర్యపోయారు. వేటగాళ్ళ నాయకుడు డేగ మెడకు గురి చూసి బాణం వదిలాడు. బాణం దెబ్బ తగలగానే డేగ చచ్చింది. దాని వేళ్ళ గోళ్ళ నుంచి కిందికి జారిన బిడ్డను వేటగాళ్ళ నాయకుడు రెండు చేతులతో పట్టుకున్నాడు.

పిల్లలు లేని వేటగాళ్ళ నాయకుడు అందమైన మగ బిడ్డను చూసి పరమానందం చెందాడు. బిడ్డను ఇంటికి తీసుకుపోయి భార్యకు ఇచ్చాడు. వేటగాడూ, భార్యా బిడ్డ అందాన్ని చూసి మురిసి

దృశ్యం - 3

అర్ధరాత్రి సమయం. గాలి వాన. రక్షకుడు దొంగతనం చేయడానికి నగరానికి వెళుతూ, వాన ఉధృతం కావడంతో దాపులనున్న పాత

మండపంలోకి వెళ్ళాడు. మారువేషంలో నగర సంచారం చేస్తున్న ఆ దేశాన్నేలే రాజు కూడా వాన కారణంగా అదే మండపంలోకి చేరాడు. మారువేషంలో ఉన్న రాజు దొంగను, ''నువ్వెవరు బాబూ?'' అని అడిగాడు. ''నేనెవరన్నది నువ్వు అడుగుతున్నావు. మరి, నువ్వెవరో నేను తెలుసుకోవచ్చా?'' అని ఎదురు ప్రశ్న వేశాడు దొంగ.

నగర పరిస్థితులను రహస్యంగా తెలుసుకోవడానికి రాజు మారువేషంలో వచ్చాడు. కాబట్టి తన గురించి నిజం చెప్పే స్థితిలో ఆయన లేడు. అందువల్ల, ''నాది ఈ ఊరు కాదు. జీవనోపాధి వెతుక్కుంటూ నగరానికి వెళుతున్నాను,'' అని అబద్ధం చెప్పాడు.

అబద్ధాలు చెప్పలేని రక్షకుడు, ''నేనొక దొంగను. నా పేరు రక్షకుడు. వానకు తల దాచుకోవడానికి నీలాగే ఈ మంటపంలోకి వచ్చాను,'' అన్నాడు.

ఆ మాట వినగానే రాజుకు తను అబద్ధం చెప్పవలసి వచ్చింది కదా అన్న బాధ కలిగింది. రక్షకుడు పేరు మోసిన దొంగ అయినప్పటికీ సత్యమే మాట్లాడగల అతడి ఉన్నత గుణాన్ని లోలోపల మెచ్చుకున్నాడు. దొంగ కేదైనా సాయం చేయాలనుకున్నాడు.

''నువ్వు దొంగవైనప్పటికీ సత్యసంధుడివి. నీకోసాయం చేస్తాను. నిధి ఉండే చోటు నీకు చెబుతాను. నువ్వు అక్కడికి వెళితే నీకు విలువైన వస్తువులు దొరుకుతాయి. నీకు దొరికే వాటిలో సగం నాకు ఇవ్వాలి,'' అంటూ రాజు దొంగతో ఒక ఒప్పందానికి వచ్చాడు. ఆ తరవాత నిధి ఉండే చోటును వివరించాడు. కాపలా కట్టుదిట్టంగా ఉంటుందనీ, కాపలా భటులు కడు సమర్థులనీ హెచ్చరించాడు. ''ఆ విచారం నీకు వద్దు. ఈ రక్షకుడు వాటన్నిటినీ చూసుకోగలడు. నువ్వు ఇక్కడే ఉండు. నీ వాటా పుచ్చుకుందువు గాని,'' అంటూ దొంగ అక్కడి నుంచి వేగంగా వెళ్ళిపోయాడు. రాజు అక్కడే కాచుకుని కూర్చున్నాడు.

దృశ్యం - 4

సూర్యోదయం కాబోతోంది. వెలుతురును చూడడానికి రాజుకు భయంగా ఉంది. మారువేషంలో వున్న రాజు తెల్లవారే సరికి రాజభవనం చేరుకోవాలి. దొంగ ఎప్పుడు వస్తాడా అని ఆత్రుతగా ఎదురు చూస్తూండగా రక్షకుడు వచ్చాడు. కాపలా భటులతో పోరాడ్డం వల్ల





ఒళ్ళంతా గాయపడి నెత్తుటి మరకలు కనిపిం చాయి. ''ఆ కాపలా భటులు కూడా చాలా ధైర్యవంతులు. వాళ్ళను మట్టుపెట్టడానికి నేను చాలా కష్టపడవలసి వచ్చింది. అందుకే ఆలస్యమయింది,'' అంటూ దొంగ రాజు ముందు మిలమిల మెరిసే రెండు విలువైన వజ్రాలను ఉంచాడు.

''ఇలాంటి వజ్రాలు ఆ పెట్టెలో మూడు కనిపించాయి. నేను దొంగిలించిన దానిలో నీకు సగం వాటా ఇవ్వాలి కదా? అందువల్ల రెండు వజ్రాలు మాత్రం తీసుకుని మూడో వజ్రాన్ని పెట్టెలోనే వదిలి వచ్చాను. వజ్రాన్ని రెండుగా పగలగొడితే ఎందుకూ పనికి రాకుండా వృథా అయిపోతుంది. ఇరువురికీ ఉపయోగ పడదు కదా,'' అన్నాడు దొంగ.

తెల్లవారే లోపల రాజభవనం చేరుకోవాలన్న ఆదుర్దాలో, రాజు ఆ రెండు వజ్రాల్లో ఒక దాన్ని తనవాటాగా తీసుకుని, రాజభవనానికి హడా వుడిగా తిరిగి వెళ్ళాడు. దొంగ కూడా అడవికి వెళ్ళిపోయాడు.

దృశ్యం - 5

రాజు నిండు సభలో కొలువుదీరాడు. మంత్రి లేచి సింహాసనంలో ఉన్న రాజును చూసి, ''ప్రభూ! తమరెందుకు అత్యవసరంగా సభ ఏర్పాటు చేశారో తెలుసుకోవచ్చా?'' అని అడిగాడు.

''ఖజానా నుంచి వజ్రాలు దొంగిలించబడి నట్టు నాకు రాత్రి కలవచ్చింది,'' అన్నాడు.

ఆ మాట విన్న మంత్రి నవ్వుతూ, ''ఖజానా కాపలాకు సమర్థులైన సైనిక భటులను నియ మించి ఉన్నాం కదా ప్రభూ. ప్రపంచంలో ఎవ్వరూ వారిని ఓడించి ఖజానాలోపల అడుగు పెట్టలేరు. మీ కల కేవలం కల మాత్రమే. విచా రించకండి ప్రభూ!'' అన్నాడు.

''నాకు విచారంగానే ఉన్నది. ఆ వజ్రాలు దాచిన రహస్య ప్రదేశం నీకూ, నాకూ మాత్రమే తెలుసు. కాబట్టి నువ్వు వెళ్ళి వజ్రాలు ఇంకా అక్కడ భద్రంగా ఉన్నాయేమో చూసిరా,'' అని ఆజ్ఞాపించాడు రాజు. మంత్రి, ''చిత్తం ప్రభూ!'' అంటూ అక్కడి నుంచి బయలుదే రాడు.

దృశ్యం - 6

ఖజానా భవనం కాపలాకాస్తున్న సైనికులు చచ్చి పడి ఉన్నారు. లోపలి గదిలోకి వెళ్ళిన

మంత్రి వజ్రాలు భద్రపరచిన పెట్టెను తెరిచి చూశాడు. దొంగ ఒక వజ్రాన్నయినా వదిలి పెట్టాడుకదా అని సంతోషించిన మంత్రి, దాన్ని తీసి భద్రంగా దుస్తుల్లో భద్రపరుచుకున్నాడు.

దృశ్యం - 7

''అవును ప్రభూ! మీరు కన్న కల నిజమయింది! విలువైన వజ్రాలు దొంగిలించబడ్డాయి. కాపలాకాస్తున్న సైనికులు కూడా చంపబడ్డారు,'' అన్నాడు సభకు తిరిగివచ్చిన మంత్రి.

దొంగలను ఎలాగైనా బంధించి సభకు తీసుకురమ్మని భటులకు ఆజ్ఞను కూడా జారీ చేశాడు.

మంత్రి మాటలు విన్న రాజు సింహాసనం నుంచి లేచి నిలబడి, ''సభాసదులారా! ఆ వజ్రాలను దొంగిలించిన వారిలో నేను ఒకణ్ణి. కొల్లగొట్టబడిన దానిలో నా వాటా ఇది,'' అంటూ తన వద్ద ఉన్న వజ్రాన్ని తీసి సభ ముందు ఉంచాడు.

ఆ తరవాత రాజు, ''రెండవ వజ్రాన్ని దొంగిలించిన వాడు పేరుమోసిన గజదొంగ రక్షకుడు. మూడవ వజ్రాన్ని దొంగిలించిన వాడు అందరిలోకీ పెద్ద దొంగ. వాణ్ణే మనం పట్టుకోవాలి,'' అని చెప్పగానే మంత్రి అవమానంతో తలదించుకున్నాడు...

ఇక్కడితో కథ ఆగిపోయింది...

''గౌరవనీయమైన దొంగ కథ ఆ తరవాత ఏమయింది? మూడో వజ్రం ఏమయింది?'' అంటూ పిల్లలు బామ్మను ప్రశ్నలతో ముంచెత్తారు.

''అది చాలా చాలా పెద్ద కథర్రా... ఆ తరవాత చాలా రోజులకు ఆ గౌరవనీయమైన దొంగ తపస్విగా మారి వాల్మీకి మహర్షియై రామాయణం రచించాడు,'' అంటూ బామ్మ ఆ పెద్ద కథను ఒక్క వాక్యంలో పూర్తి చేసేసింది.

తక్కిన కథను ఏ తాతయ్యనుంచో, బామ్మ నుంచో మీరు వినవచ్చు.



## చిరస్మరణీయ చారిత్రక ఘట్టాలు-4

# పన్నాదాయ్ అనుపమ త్యాగం

రాణా సంగ్రామసింగ్ రాజస్థాన్‌లోని మేవార్‌ను పరిపాలించి దాదాపు ఐదు వందల సంవత్సరాలు గడిచిపోయాయి. ధైర్యసాహసాలకూ, ధర్మ పాలనకూ పేరొందిన ఆయన పేరు వినగానే ప్రజలు ఆయన పట్ల గౌరవ మర్యాదలు కనబరచేవారు.

బాబర్ భారతదేశంపై దండయాత్ర చేసి. 1526 ఏప్రిల్ 21వ తేదీ జరిగిన మొదటి పానిపట్టు యుద్ధంలో ఇబ్రహీంలోడీని ఓడించాడు. ఢిల్లీని, ఆగ్రాను వశపరచుకుని మొగల్ సామ్రాజ్యాన్ని స్థాపించాక, బాబర్ దృష్టి రాజస్థాన్ మీదికి మళ్ళింది.

మొగల్ సేనలను రాజపుత్ర సైనికులు దీటుగా ఎదుర్కొని అసమాన ధైర్యసాహసాలతో పోరాడారు. అయినా, తన సైన్యంలోని ఒక దళనాయకుడి ద్రోహం కారణంగా రాణా సంగ్రామసింగ్ దాపులనున్న కొండలలోకి తప్పించుకుని పోవలసివచ్చింది. మొగలులపై ఎలాగైనా పగ సాధించాలన్న పట్టుదలతో ప్రయత్నించినప్పటికీ రాణా 1527లో మరణించాడు. ఆ తరవాత బాబర్, వాటిల్లిన సైనిక నష్టాలు చాలనుకుని రాజపుత్ర వీరులను వేధించకుండా వాళ్ళు ప్రశాంతంగా జీవించేలా ఢిల్లీకి తిరిగి వెళ్ళాడు.

రాణా సంగ్రామసింగ్ జ్యేష్ఠకుమారుడు రత్నసింగ్ మేవార్ పాలకుడయ్యాడు. అయితే, పొరుగు ప్రాంత యువరాజుతో జరిగిన గొడవలో అతడు మరణించడంతో, అతడి తమ్ముడు విక్రమ్‌జిత్ సింహాసనాన్ని అధిష్ఠించాడు. అతడు దురహంకారీ, ప్రజాక్షేమం పట్ల శ్రద్ధ లేనివాడూ, వినోద ప్రియుడూ కావడంతో సదా సర్వవేళలా మల్లయుద్ధాలు, ఆటల పోటీలు అంటూ వినోదకార్యక్రమాలతో కాలక్షేపం చేసేవాడు.

దానికి తోడు సామంతులనూ, ప్రముఖులనూ గౌరవించేవాడు కాడు. పూచిక పుల్లతో సమానంగా చూసేవాడు.దాంతో



మేవార్‌లో అరాచక పరిస్థితులు ఏర్పడ్డాయి. వాటిని అవకాశంగా తీసుకుని గుజరాత్ సుల్తాన్ బహదూర్‌షా మేవార్ రాజధాని చిత్తోర్‌ను ముట్టడించాడు.

రాజపుత్ర యోధులు ప్రాణాలకు తెగించి వీరోచితంగా పోరాడారు. అయినప్పటికీ ఓటమి తప్పదన్న సంకటస్థితి ఏర్పడగానే-శత్రువుల బారినుంచి తప్పించుకోవడానికి చిత్తోర్ కోట లోని పద్నాలుగువేల మంది స్త్రీలు 'జోహర్' అనే అగ్ని ముట్టించి అందులో ధైర్యంగా ప్రవేశించి ప్రాణత్యాగం చేశారు.

ఆ వీరోచిత కృత్యాన్ని చేయించింది రాణా సంగ్రామ సింగ్ వీరపత్నీ, చంటిబిడ్డగా వున్న యువరాజు ఉదయ్ సింగ్ తల్లీ అయిన రాణి కర్నావతి. తండ్రి మరణించాక జన్మించిన ఉదయ్‌సింగ్‌ను రహస్యంగా సురక్షిత ప్రాంతానికి చేర్చారు.

ఆ తరవాత మొగలులు విక్రమ్‌జిత్‌కు సింహాసనం అప్పగించినప్పటికీ, ప్రజలు అతడి దుష్టపాలనను భరించలేకపోయారు.

సింహాసనానికి వారసుడైన ఉదయ్‌సింగ్ పెద్దవాడయ్యేంతవరకు పాలనా బాధ్యతలు ఎవరు చూసుకోగలరు? రాణా సంగ్రామసింగ్ తమ్ముడు పృధ్వీరాజ్ కుమారుడైన బన్‌బీర్‌ను పాలనా బాధ్యతలు చేపట్టమని రాజపుత్ర ప్రముఖులు కోరారు. అందుకు అతడు అంగీకరించాడు.

పాలనా బాధ్యతలు చేపట్టిన బన్‌బీర్‌కు తనే రాజుగా స్థిరపడాలన్న దురాశపుట్టుకురావడంతో అందుకు అవరోధంగా ఉన్న రాణా సంగ్రామసింగ్ ఇద్దరు కుమారులను తొలగించాలనుకున్నాడు. ప్రజల ద్వేషానికిగురై, రాజ్యం వదిలి పారిపోనున్న సమయంలో, బన్‌బీర్ విక్రమజిత్‌ను హతమార్చాడు. ఇక మిగిలి ఉన్నది ఒక్క పసికందు ఉదయ్‌సింగ్ మాత్రమే. ఆ శిశువును హతమార్చడానికి క్రూరుడైన బన్‌బీర్ దుష్టపథకం వేశాడు.

ప్రశాంతమైన రేయి. చిత్తోర్ కోట అంతఃపుర భవనం నుంచి తియ్యటి జోలపాట లీలగా వినిపిస్తోంది. రాకుమారుడు నిదిరిస్తూన్న రత్నాలు పొదిగిన అందమైన ఉయ్యాలను ఊపుతూ జోలపాడుతూన్న పన్నాదాయ్ చేతిలో రాకుమారుడి



ఈడువాడే అయిన ఆమె సొంత బిడ్డ కూడా ఉన్నాడు.

అర్ధరాత్రి సమయంలో హడావుడిగా వచ్చిన ఒక సేవకుడు ఆమె చెవిలో ఏదో చెప్పాడు. ఆ మాట వినగానే ఆమె ముఖం వెలవెలపోయింది. వెంటనే ఆమె చేతిలోని తన బిడ్డను ఉయ్యాలలో పడుకోబెట్టింది. ఉయ్యాలలోని రాకుమారుడి ఆభరణాలను, దుస్తులను తీసి తన బిడ్డకు తొడిగింది. రాజభవనంలోని వంటవాణ్ణి పిలిచి పళ్ళబుట్టను తెమ్మని చెప్పి, రాకుమారుణ్ణి అందులో సుతారంగా పడుకోబెట్టి, బుట్టను ఆకులతో కప్పింది. బిడ్డను రహస్యంగా కోటనుంచి తీసుకువెళ్ళమని వంటవాణ్ణివేడుకున్నది.

కొంతసేపటికి పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ రాజప్రతినిధి బన్‌బీర్ అక్కడికి వచ్చాడు. క్రూరమైన చూపులతో కత్తి దూసి పసికందు గుండెల్లో గుచ్చి చంపి, వచ్చిన వేగంతో తిరిగి వెళ్ళిపోయాడు. యువరాజు మరణించాడని రాజకుటుంబీకులు భోరునవిలపిస్తూండగా,



పన్నాదాయ్, కళ్ళెదుట చంపబడ్డ పుత్రశోకాన్ని దిగమింగుకుని రాజభవనం నుంచి వేగంగా వెలుపలికి నడిచింది.

ఆమె నదీ తీరానికి చేరేసరికి అక్కడ విశ్వాసపాత్రుడైన వంటవాడు బుట్టతో సిద్ధంగా ఉన్నాడు. అదృష్టవశాత్తు బిడ్డ మేలుకోలేదు. వాళ్ళు వేగంగా దోలాకు వెళ్ళి యువరాజుకు ఆశ్రయం వేడుకున్నారు. యువరాజు పట్ల సానుభూతి ఉన్నప్పటికీ దుర్మార్గుడైన బన్‌బీర్‌కు భయపడి ఆశ్రయం ఇవ్వలేనని తన నిస్సహాయతను తెలియజేశాడు అక్కడి పాలకుడు.

పన్నా రైతుమహిళ వేషంతో బిడ్డనెత్తుకుని, వంటవాణ్ణి వెంటబెట్టుకుని డోంగర్‌పూర్‌కు బయలుదేరింది. ఆశానిరాశల మధ్య కొట్టుమిట్టాడుతూ కొండ మీది భవనం చేరిన ఆమెకు ఆశాభంగమే ఎదురయింది. పరమకిరాతకుడైన బన్‌బీర్ ఆగ్రహానికి గురికాలేనని సామంత రాజు రావల్ అయిస్కుర్న్ నిర్దాక్షిణ్యంగా ఆమెను పంపేశాడు.

మేవార్ రేపటి రాజును ఎలాగైనా సురక్షితమైన చోటికి చేర్చాలన్న పట్టుదలతో నిద్రాహారాలు, శ్రమ, అలసట లెక్కచేయకుండా పన్నా కొండలూ కోనలూ దాటుకుంటూ ఆరావళీ పర్వతశ్రేణులలోని కొముల్మేర్‌కేసి నడవసాగింది. హఠాత్తుగా వంటవాడు తీవ్రమైన జ్వరానికి లోనయ్యాడు. దయాహృదయులైన భిల్లులనే స్థానిక గిరిజనులు అతడికి తాము సాయపడగలమని చెప్పి, పన్నాకు దారిచూపి సాగనంపారు.

తెలతెలవారుతూండగా చిన్న కొండమీది కొముల్‌మేర్ రాజభవనం బాదల్‌మహల్ కనిపించగానే పన్నాకు కొత్త ఆశలు చిగురించాయి.



రాజు అస్సాసాహ్ ఆమెను కరుణతో ఆదరించాడు. చిత్తోర్‌కు పట్టిన దుర్గతిని వివరించిన పన్నా, "ఈ చిన్నారి యువరాజును సురక్షితమైన తమ రక్షణలో ఉంచితే తప్ప నాకు మనశ్శాంతి ఉండదు," అన్నది సజల నయనాలతో. అస్సాసాహ్ఏమిచెప్పడానికీ తోచక ఆలోచనలో పడ్డాడు. అప్పుడు ఆయన తల్లి, "దీనికెందుకు ఇంత ఆలోచన? ఈబిడ్డ రాణాసంగ్రామ సింగ్ కుమారుడు. నీకు రాజు. రాజుపట్ల విశ్వాసం ఉన్నవాడికి భయం అన్నది ఉండ కూడదు. నీ ఎదుట నిలబడ్డపన్నా ఒక సాధారణ మైన దాది. ఆమె చేసిన నిరుపమాన త్యాగం; కనబరచిన అసమాన ధైర్యం; పడ్డ కష్టాలు చూశాక కూడా నీలో ఎందుకీ సందిగ్ధత?" అన్నది రాజుతో.

అప్పుడాయన బిడ్డను తనచేతుల్లోకితీసుకుని, "ఈ చిన్నారి యువరాజు సంరక్షణా బాధ్యత నాది. నువ్వు నిశ్చింతగా వెళ్ళిరా," అని పన్నాకు మాట ఇచ్చాడు.

పన్నా ఆ మాటలకు పరమానందం చెంది, బిడ్డను తీసుకుని మరొక్కసారి ఆప్యాయంగా హృదయానికి హత్తుకుని రాజుచేతికిచ్చింది. బిడ్డను ఆప్యాయంగా రెండుమూడుసార్లు చేత్తో నిమిరింది. కన్నీటితో రాజుకు కృతజ్ఞతా పూర్వకంగా చేతులెత్తి నమస్కరించి, రాణిగారి కిచ్చిన మాటను నిలుపుకున్నామన్న తృప్తితో భవనం నుంచి వెలుపలికి నడిచింది.

ఏడేళ్ళు గడిచిపోయాయి. తన ఈడువాడే అయిన అస్సాసాహ్‌కుమారుడితో కలిసి ఉదయ్ సింగ్ పెరగసాగాడు. ఒకనాడు రాజభవనానికి అతిథిగా వచ్చిన అస్సాసాహ్ మిత్రుడైన ఒక రాజపుత్ర ప్రముఖుడు ఉదయ్‌సింగ్‌ను చూసి ఆశ్చర్యపడి, "ఎవరీ రాజకుమారుడు?" అని అడిగాడు. అస్సాసాహ్‌కి అసలు సంగతి చెప్పక తప్పలేదు. రాజపుత్ర ప్రముఖుడు ఉదయ్ సింగ్‌కు నమస్కరించాడు. అచిర కాలంలోనే ఆ సంగతి అందరికీ తెలిసిపోయింది. మేవార్ ప్రముఖులు, చుట్టుపక్కల నాయకులు న్యాయ బద్ధమైన యువరాజుకు తమ మద్దతును తెలియజేశారు.

పరమ దుష్టుడూ, దురహంకారీ అయిన బన్‌బీర్ పట్ల ప్రజలలో తీవ్రమైన వ్యతిరేకత బయలుదేరింది. పసి యువరాజు నాయకత్వంలో పెద్ద సైన్యం చిత్తోర్ కోటను ముట్టడించింది. బన్‌బీర్ సైన్యాన్ని ఎదుర్కోలేక ఓటమి భయంతో పారిపోయాడు. ప్రజల ఆనందోత్సాహాల మధ్య రాణా ఉదయ్‌సింగ్ 1597లో మేవార్ సింహాసనాన్ని అధిరోహించాడు.

# తోటను పెంచుదాం స్వయంసమృద్ధి సాధిద్దాం!

మంజులాసిద్ధి అందమైన చీర కట్టుకుని, తల నిండా మల్లెలు, చామంతులు, గులాబీలు లాంటి రంగురంగుల పువ్వులను పెట్టుకుని రంగోలీ పోటీకి బయలుదేరింది.

తమ పెరటితోట నుంచి కూతురు కోసుకుని వచ్చిన పువ్వుల బుట్టలను దగ్గరికి లాక్కుని పువ్వుల రంగోలీని అలంకరించడానికి ప్రారంభించింది. వాళ్ళ గ్రామంలో మొట్టమొదటి సారిగా జరుగుతూన్న రంగోలీ పోటీ అది. కర్నాటక రాష్ట్రం పడమటి కనుమల మధ్య వున్న నాగిన్‌కొప్ప గ్రామంలో ఆరోజు విలక్షణమైన విత్తనాల పండుగ జరుపుకుంటున్నారు. ఆ పండుగలో చివరి అంశం రంగోలీ పోటీ. అంటే స్త్రీల మధ్య జరిగే పూలముగ్గులపోటీ అన్న మాట.

మంజులకు పువ్వులంటే మహా ఇష్టం. ఇన్నాళ్ళు ఎంతో శ్రద్ధగా పెంచిన పెరటి పూల తోటలోని పువ్వులు ఈరోజు ఇలా ఉపయోగ పడుతున్నాయన్న మాట. ఆమె దీక్షగా ముగ్గును రంగురంగుల పువ్వులతో అలంకరిస్తూంటే, ఆమె మనసులో బకుల్ పట్ల కృతజ్ఞతాభావం పెల్లుబకసాగింది. పట్నం నుంచి వచ్చిన బకుల్ అనే ఆ యువతే పల్లెపడతుల హృదయాలలో ఆసక్తి అనే విత్తనాలను వెదజల్లింది. ఎప్పుడూ చిరునవ్వుతో కనిపించే బకుల్ ఆధ్వర్యంలోనే ఇప్పుడీ విత్తనాల పండుగ కూడా జరుగుతు న్నది. ఇవన్నీ ఎలా జరిగాయన్నది మంజుల మనసులో కదలాడసాగింది...

అదొక మధ్యాహ్న సమయం. నాగిన్ కొప్ప లోని స్త్రీలు, పొద్దుననగా పొలాలకు వెళ్ళి మండుటెండలో వరికోత కోసి, అప్పుడే



ఇళ్ళకు తిరిగి వస్తూ, సేదతీరడానికి ఒక చెట్టు కింద కూర్చున్నారు. వారిలో మంజుల కూడా ఉన్నది. పక్కనే పాత కాలపు పద్ధతిలో చెరకు గానుగాడుతున్నారు. గానుగకు కట్టిన ఎడ్లు ఓర్పుగా తిరుగుతున్నాయి. పనివాళ్ళు చెరకు గడలను అందిస్తున్నారు. చెరకురసం పెద్ద పెద్ద తొట్టెల్లోకి చేరుతున్నది.

నాగిన్‌కొప్ప రైతులు పాత రకాల చెరకును పండించేవారు. అవి మిల్లులో చక్కెర తయారీకి మరీ మెత్తగా ఉండేది. అయితే, వాటితో అద్భుతమైన బెల్లం తయారయ్యేది. కొన్నాళ్ళ క్రితం సమీపంలోని పట్నం నుంచి ఒకావిడ దాని కోసమే వెతుక్కుంటూ వచ్చి ఆ రకం విత్తనంచెరకును కొనుక్కుని వెళ్ళేది. ఆ రకం చెరుకు ఉత్తమమనీ, కొత్త రకం హైబ్రిడ్ చెరకుకు, ఎక్కువ ఎరువులూ, నీరూ కావలసి వస్తాయనీ ఆవిడ చెప్పేది. పైగా, శుద్ధి చేయబడిన తెల్లచక్కెర కన్నా, బెల్లం ఉపయోగించడమే ఆరోగ్యకరం అనేదామె.

చెట్టుకింద కూర్చున్న స్త్రీలు తమ ఊళ్ళో పండే చెరకు గురించి మాట్లాడుకుంటూండగా, ఒక యువతి వాళ్ళ కేసి రావడం కనిపించింది. ఆమె పేరే బకుల్. పంటలు పండించడానికి స్థానికమైన పాత రకాల విత్తనాలనే వాడాలనీ, కొత్త హైబ్రిడ్ వద్దనీ ఆమె ఊరూరూ తిరిగి ప్రచారం చేస్తోంది. ఆమె నాగిన్ కొప్పకు రావడం ఇది రెండోసారి. మొదట వచ్చినప్పుడు చుట్టుపక్కల ప్రాంతంలో పండే పంటలు, వాటి విత్తనాల స్లైడ్స్ చూపిస్తానని చెప్పి వెళ్ళింది. ఆమె చేతిలో ఒకసంచీ ఉండడం గమనించి, అందులో స్లైడ్స్ ఉంటాయని స్త్రీలు గ్రహించారు.

వాళ్ళు ఊహించినట్టే బకుల్ వారికి ఒక గోడ మీదికి బొమ్మలను ప్రొజెక్ట్ చేసి ఆ స్లైడ్స్ చూపించింది. పడమటి కనుమల పరిసరాల్లోని ప్రజలు తమ ఇళ్ళ ఆవరణల్లోనే పండించే రకరకాల కూరగాయలు, పళ్ళు, పువ్వులు, మూలికలు, తీగలు మొదలైన వాటిని వివరించే స్లైడ్స్ అవి. తమ చుట్టుపక్కల గ్రామాల్లోనే అన్నిరకాలు ఉన్నాయా అని మంజులతో పాటు స్త్రీలందరూ అమితమైన ఆనందాశ్చర్యాలు చెందారు.

"అయ్యో, ఈశ్వరా! గుబ్బి హాగల్ కాయిని మళ్ళీ చూడగలనని నేనెప్పుడూ అనుకోలేదు. అది ఎప్పుడో నశించిపోయిందనుకున్నాను," అని ఆశ్చర్యపోయింది గంగమ్మ, పిచ్చుక తల పరిమాణంలో వున్న కాకరకాయబొమ్మను చూడగానే.

"మీ ఊరికి కొద్ది దూరంలోనే అవి చాలా పండుతున్నాయి. కావాలంటే మీకు వాటి విత్తనాలు తెచ్చి ఇస్తాను," అన్నది బకుల్.

"తప్పక తెచ్చివ్వు తల్లీ. ఆ రకం కాకరకాయల వేపుడు





చాలా రుచిగా ఉంటాయి,'' అన్నది గంగమ్మ ఎంతో ఆశగా.

ఆ తరవాత బకుల్ వాళ్ళకు తెలిసిన కాకర రకాల గురించి అడిగింది. వాళ్ళు ఆలోచించి, ఆలోచించి ఎనిమిది రకాల కాకర గురించి చెప్పారు.

''ఒక్క కాకరలోనే ఇన్ని రకాలున్నాయంటే -మిగతా వాటిలో ఎన్నేసి ఉంటాయో ఆలోచించి చూడండి. కావాలంటే మీ ఇంటి పెరట్లోనే వంద రకాలు పండించవచ్చు. అవి మీ ఇంటి అవసరాలకు ఉపయోగపడతాయి. మిగిలినవి అమ్ముకోవచ్చు. డబ్బులు వస్తాయి. విత్తనాలను సేకరించారంటే, విత్తనాలుకొనే అవసరం ఉండదు. కావాలంటే వాటిని అవసరమైన వారికి అమ్మి మరింత డబ్బు సంపాదించవచ్చు,'' అని వివరించింది బకుల్.

ఆ తరవాత స్త్రీలందరూ రకరకాల కూరగాయల గురించీ, పళ్ళూ, పూలచెట్ల గురించీ ఉత్సాహంగా చర్చించుకున్నారు. వాళ్ళ ఉత్సాహన్ని చూసి సంతోషించిన బకుల్, ''మీరందరూ ఒక బృందంగా ఏర్పడి వీటిని గురించి బాగా చర్చించుకుని కార్యాచరణకు దిగితే బావుంటుంది కదా,'' అని అడిగింది.

''అవును, అవును,'' అన్నారు అందరూ ముక్తకంఠంతో.

హఠాత్తుగా ఏదో గొప్ప ఆలోచన మెరిసినట్టుగా, ''మీరు విత్తనాల పండుగ జరపడానికి సాయపడవచ్చు కదా? చుట్టు పక్కల గ్రామాల ప్రజలందరూ తమ వద్ద ఉన్న విత్తనాలను ఒక చోటికి తీసుకురావాలి. తమ వద్ద ఉన్నవాటిని ఇతరులకు ఇచ్చి, వారివద్ద ఉన్న వాటిని తాము పుచ్చుకోవచ్చు. దాని ద్వారా మా పెరటి తోటల్లో రకరకాల పూల మొక్కలు, పళ్ళ చెట్లు పెంచడానికి వీలవుతుంది.

''ఈ పండుగసందర్భంగా ఆటలు, పాటలు, రంగోలీ పోటీలు కూడా నిర్వహించవచ్చు,''

అన్నది మంజుల. ''అద్భుతమైన ఆలోచన! అలాగే నిర్వహిద్దాం,'' అన్నది బకుల్ ఆనందంతో మెరిసే కళ్ళతో.

అందరూ అందుకు సంతోషంగా అంగీకరించారు. వృద్ధురాలైన గంగమ్మ కూడా, ''నా దగ్గరున్న విత్తనాలన్నిటినీ నేను తీసుకువస్తాను. మీ దగ్గర ఉన్నవి మీరు తీసుకురండి. మీ పిల్లల్ని కూడా వెంట బెట్టుకుని రండి. ఈ విత్తనాల గొప్పతనం వాళ్ళకు తెలియాలి. గుప్పెడు విత్తనాలు కుటుంబాన్నీ, సమాజాన్నే కాపాడగలవని వాళ్ళు గ్రహించాలి,'' అన్నది పట్టరాని ఉత్సాహంతో.

...అలా ఆరంభమైన ఉత్సవంలో అందరూ ఆనందంగా పాలుపంచుకున్నారు. తాము చిన్నప్పుడెప్పుడో చూసిన విత్తనాలు, తాము మరిచి పోయిన విత్తనాలు మళ్ళీ కనిపించే సరికి కొందరు వృద్ధులు పరమానందం చెందారు. తరగని ప్రకృతి సంపదనూ, వినోద కార్యక్రమాలనూ చూసి పిల్లలు అమితోత్సాహం పొందారు.

...ముగ్గును పూలతో అలంకరించడం పూర్తి చేసిన మంజుల లేచి నిలబడి ఒకసారి దాన్ని తనివి తీరా చూసుకున్నది. రంగోలీ పోటీలో పాల్గొన్న వారందరూ ముగ్గులు అలంకరించి పూర్తి చేశారు. గంగమ్మ, బకుల్ ఒక్కొక్క ముగ్గునూ పరిశీలనగా చూస్తూ వచ్చారు. ఉత్తమమైన రంగోలీని వారే ఎంపిక చేస్తారు. రంగోలీలను చూస్తూ వారు ఒకటి రెండుసార్లు అటూ ఇటూ తిరిగారు. పరస్పరం చర్చించుకున్నారు. మంజుల ఊపిరి బిగబట్టుకుని ఎదురు చూడసాగింది. ఆఖరికి ఫలితాలు వెల్లడించారు: ''రంగోలీ పోటీలో ప్రథమ బహుమతిని అందుకుంటున్నది మంజులా సిద్దీ!'' అని ప్రకటించింది బకుల్. అందరూ ఆనందంతో చప్పట్లు కొట్టారు. మంజుల వెళ్ళి బహుమతిని అందుకున్నది. తక్కినవారందరూ ఆమెను అభినందించారు.

పిల్లలను వెంటబెట్టుకుని, బహుమతితో సంతోషంగా ఇల్లు చేరిన మంజుల, రంగురంగుల పూలనందించిన తన పెరటి తోటకు మనసులోనే కృతజ్ఞతలు తెలియజేసింది. తనను ప్రేమించేవారిని ప్రకృతి తప్పక బహూకరిస్తుందని ఆమె అనుభవపూర్వకంగా గ్రహించింది.

–సునీతా రావు



# నేను నా దేశాన్ని ప్రేమిస్తున్నాను

అక్టోబర్ 2007 సంచికలో ప్రకటించిన పోటీకి అధిక సంఖ్యలో ఎంట్రీలు వచ్చాయి. కాని, పోటీలో పాల్గొన్న పలువురు 'నా దేశాన్ని ప్రేమిస్తున్నాను,' అన్న పోటీ ఇతివృత్తానికి సంబంధించిన ఎంట్రీలను పంపలేకపోయారు. అరవైయ్యేళ్ళ స్వతంత్ర భారతదేశానికి సంబంధించిన ఎంట్రీలు మరీ తక్కువ సంఖ్యలోనే వచ్చాయి. మామూలు కథలు, కవితలు, వ్యాసాలు ఎక్కువగా వచ్చాయి. వాటి నుంచి ఎంపిక చేసిన కొన్ని రచనలను, వర్ణ చిత్రాలను ఈ సంచికలో ప్రచురిస్తున్నాం. విజేతలకు అభినందనలు. కథలలో ఉత్తమమైన వాటిని వేసవి ప్రత్యేక సంచికలో ప్రచురించాలని నిర్ణయించాం. దీనికి సంబంధించిన ప్రకటన త్వరలో వెలువడగలదు.

-సం.

## నా కలలు పూచే నేల...

''ఇది నా మాతృదేశం. నా ప్రియమైన భారతదేశం! నా దేశాన్ని నేను నిరంతరం ప్రేమిస్తున్నాను!''

ఉదయభానుడు భారత దేశాన్ని బంగారు కిరణాలతో అలంకరిస్తాడు. అస్తమిస్తున్న సూర్యుడు ఇంతటి సుందర భూమిని వదిలి వెళ్ళ వలసి ఉన్నదే అన్న విచారంతో కనుమరుగవుతాడు.

ఇది అహంభావం కాదు. మహోన్నత భారతదేశం ఈనాడు స్వతంత్రదేశంగా సాటి ప్రపంచ దేశాలలో సమున్నత స్థానాన్ని వహిస్తున్నది. దేశానికి సహజ కిరీటంలా ఉత్తరాగ్రంలో హిమాలయ పర్వతం. మూడు వైపులా ఉత్తుంగ తరంగాల మహాసాగరాలు. గతకాలపు గాయాలను కడుగుతున్నట్టు అసంఖ్యాకమైన నదీ నదాలు. శాంతి సహనాలకు నిలయం మన సువిశాల భారతదేశం!

భారదేశ గతకాల వైభవానికి మౌనసాక్ష్యంగా కాలం. ప్రతి విదేశీయుడికీ మనదేశం జ్ఞాన భాండాగారంగా ఉండేది. దురదృష్టవశాత్తు ఆంగ్లేయుల పాలనకు లోనయ్యాం. వారి చేతిలో కీలుబొమ్మలైపోయాం. గత వైభవాన్ని కోల్పోయాం.

అయినా ఇది ఎంతో కాలం కొనసాగలేదు. త్యాగధనుల పోరాటం కారణంగా బ్రిటిష్ పంజరం నుంచి భారతదేశమనే పక్షి బయట పడింది.

స్వేచ్ఛాకాశంలో రెక్కలు విప్పి విహరించడం ప్రారంభించి అరవై యేళ్ళయింది. స్వతంత్ర భారత దేశంలో అవకాశాలకు కొదువలేదు. కష్టపడి పనిచేసి, బలహీనతలను అధిగమించి ముందుకు సాగవలసిన అవసరం ఎంతైనా ఉంది.



ప్రతి భారతీయుడూ దీని నొక సవాలుగా స్వీకరించాలి. యావత్ ప్రపంచం ప్రశంసించే విధంగా పాటు పడాలి. నిజంగానే అద్భుతమైన భారత దేశాన్ని రూపొందించుకోవాలి.

-దేవయాని దీక్షిత్ (15)
మౌంట్ కార్మెల్ గర్ల్స్
హయ్యర్ సెకండరీ స్కూల్,
నాగ్‌పూర్

## ఉద్వేగభరిత అనుభవం

**జమ్మూ**లోని పర్వతాలయం వైష్ణవీదేవి ఆలయానికి వెళ్ళిరావడం నాకు ఒక అపూర్వమైన ఉద్వేగభరిత అనుభవాన్ని కలిగించింది. మా తల్లిదండ్రులతో కలిసి ఢిల్లీ వరకు విమానంలో వెళ్ళి, అక్కడి నుంచి రోడ్డు మార్గం గుండా కొండ పాదతలంలోని కాట్రాకు చేరుకున్నాం. ఉదయం చలిచలిగా ఉంది. కాట్రా నుంచి పందొమ్మిది కి.మీ. దూరం కొండ మార్గం గుండా వెళ్ళాలి. కాలిబాటలాంటి మార్గమే ఉంది. నడవాలి లేదా గుర్రం మీద వెళ్ళాలి. కొంత దూరం వెళ్ళాక, ఆపైన నడిచి వెళ్ళలేమని చెప్పారు. అందువల్ల మిగిలిన దూరం పయనించ డానికి గుర్రాలను అద్దెకు మాట్లాడుకున్నాం. గుర్రాల యజమాని మమ్మల్ని గుడికి ఏడు కి.మీ. దూరంలో దిగబెట్టాడు.

అక్కడి నుంచి నిటారు కొండదారి. అక్కడక్కడ మెట్లు కనిపించాయి. ఎలాగో కష్టపడి ఎక్కి సాయంకాలం నాలుగింటికి ఆలయాన్ని సమీపించాం. కొండ ఎక్కడం ఉదయం ఎనిమిదింటికి ప్రారంభించాం. దేవీదర్శనానికి ముందు స్నానఘట్టానికి వెళ్ళాం. కొండపై నుంచి నీళ్ళు కిందికి దూకుతున్నాయి. ఉదయం నుంచి నడిచిన నడకకన్నా ఆ చల్లటి నీళ్ళల్లో స్నానం చేయడం మరింత భయంకరంగా తోచింది. ఒంటి మీద నీళ్ళు వేగంగా పడడం మరీ భయంకరమైన అనుభవం. స్నానం ముగించి వెళ్ళి వరుసలో నిలబడేసరికి సాయంకాలం ఐదు గంటలయింది. మాకు ముందు పెద్ద వరుస. ఒకవైపు భక్తులరద్దీ; మరోవైపు చలిగాలులు. అందువల్ల దేవీదర్శనానికి ఆరు గంటలు పట్టింది. ఆలయం లోకి ప్రవేశించాక దర్శనం త్వరగా పూర్తయింది.



రాత్రి 12.30గం.లకు తిరుగు ప్రయాణమయ్యాం. గుర్రం మీద వస్తూంటే బాగా చలివేసింది. అయినా, గుర్రాల యజమానులు సంతోషంగా పాటలు పాడుతూండడం మాకు ఆశ్చర్యం కలిగించింది! తెల్లవారు జామున మూడు గంటలకు కాట్రా చేరుకున్నాం.

కొండపై నుంచి బండల మధ్యగా కిందికి పారుతూ అక్కడక్కడ దారికి అడ్డంగా నీళ్ళు రావడంతో జారుడు మెట్లలా ఉన్న నేల మీద గుర్రాలు జాగ్రత్తగా నడవడం-మాకు గొప్ప సాహసంలా కనిపించింది. కొందరు లోతైన లోయలోకి పడబోయి తృటిలో తప్పించుకోవడం మాకెంతో ఊరట కలిగించింది. అదో మరపురాని ఉద్వేగభరిత అనుభవంగా మిగిలిపోయింది.

-పి. మేఘన రత్న (12) వరలక్ష్మి విద్యాశ్రమ్, రాజాం

• • • • • • • • • • • • • • • • • •

# రోతాంగ్ కనుమ వినోదయాత్ర

నేను ఐదవ తరగతి చదువుతున్నప్పుడు అంటే, 2003 సెప్టెంబర్‌లో మా తల్లి తండ్రులతో కలిసి ఉత్తరభారతదేశ పర్యటనకు వెళ్ళాం. అప్పుడు సిమ్లాకు చేరుకుని అక్కడి ముఖ్యమైన పరిసర ప్రాంతాలను చూడాలని నిర్ణయించాం.

మేము చూసిన వాటిలో ఒక ముఖ్యమైన ప్రదేశం రోతాంగ్ కనుమ. అక్కడి ఉష్ణోగ్రత $10^0$ సె.-$15^0$ సె. మధ్య ఉంటుంది. విపరీతమైన చలికి రక్షణగా మా అమ్మ, నాన్న, తమ్ముడు, నేను వెచ్చటి స్వెటర్లు, మఫ్లర్లు, గ్లౌవ్స్ ధరించాం. మేము అక్కడికి చేరగానే గుర్రపుస్వారీ చేయాలనుకుని, అమ్మానాన్నలను పదేపదే అడగసాగాం. తీరా దగ్గరికెళ్ళి చూస్తే, అక్కడున్నవి గుర్రాలు కావు; కంచర గాడిదలు. మొదట వద్దన్నా ఆ తరవాత వాటి మీద వెళ్ళడానికి మా తల్లిదండ్రులు అనుమతించారు. మేము విడివిడిగా ఒక్కో కంచర

గాడిద మీద వెళ్ళవలసి వచ్చింది. అయితే, నాలుగు గాడిదలనూ చూసుకోవడానికి ఒకే మనిషి ఉన్నాడు.

మేము కొంత దూరం వెళ్ళాక, కొద్దిగా చినుకులు ఆరంభ మయ్యాయి. దట్టంగా కమ్ముకున్న పొగ మంచు కారణంగా ముందున్న దేమిటో కనిపించడం లేదు. కిందికి తొంగి చూస్తే, భీతికొలిపే మొనదేలిన బండలు, శిలలు కనిపించాయి. నాకూ, మా తమ్ముడికీ ఏమవుతుందో, ఏమో అని మా తల్లిదండ్రులు భయపడ్డారు. ఏ క్షణంలోనైనా సరే మేము కిందికి పడిపోవచ్చు అనేలా గాడిదలు అడుగులు వేయసాగాయి.

అయితే, నేనూ, మా తమ్ముడూ మా ఎదుట ప్రత్యేకమైన ఆసక్తికర దృశ్యాలు చూస్తున్నట్టు నిబ్బరంతో ప్రశాంతంగా కనిపించాము. కొండలు, ఎత్తయిన చెట్లు నిండిన గంభీరమైన దృశ్యాలు కనిపించాయి.

మరి కొంత దూరం ముందుకు వెళ్ళి వెనుదిరిగాము. ఉన్నట్టుండి మా తమ్ముడు ఏడ్వడం మొదలుపెట్టాడు. కొంత సేపయ్యాక తననుతానే ఓదార్చుకున్నట్టు ఏడుపు ఆపేశాడు. కొద్దిసేపట్లోమేము బయలుదేరిన చోటికే మళ్ళీ చేరుకున్నాం. నేనొక్కత్తెనే ధైర్యంగా ఉన్నానని నన్ను అందరూ మెచ్చుకున్నారు.

నేను బస్సెక్కి కిటికీ దగ్గర కూర్చుని వెలుపలికి చూశాను. బయట ప్రతి దృశ్యం ఎంతో అందంగా కనిపించింది. దానిని మా తమ్ముడికి చూపుదామని పక్కనే కూర్చున్న అతడికేసి తిరిగాను. అతడు బల్లిని చేత్తోపట్టుకుని నాకేసి చూపడంతో కెవ్వున అరిచి, అలాగే స్పృహ తప్పి పడిపోయాను. బస్సులో ఉన్నవారందరూ నన్ను చుట్టుకుని, నాకు స్పృహ తెప్పించి అది నిజమైన బల్లి కాదనీ, బల్లి బొమ్మ అనీ చెప్పారు. అంతకు కొంతసేపు ముందే అందరూ నన్ను ఎంతో ధైర్యశాలినని మెచ్చుకోడడం చూసి, పది మంది ముందూ నన్ను ఆటపట్టించాలని మా తమ్ముడు అలా చేశాడన్నమాట!

యాత్ర నుంచి తిరిగి వచ్చాక కూడా చాలా రోజులు మా తమ్ముడు ఆ సంఘటనను గుర్తు చేస్తూ, ''బల్లి బొమ్మను చూస్తే హడలు కుంటావే తప్ప, నువ్వు నిజంగా మహా ధైర్యశాలివి అక్కయ్యా,'' అంటూ నన్ను ఎగతాళి చేసేవాడు.

–బి. మేఘవిద్య (14) సుందరవల్లి మెమోరియల్ స్కూల్



పోటీకి వచ్చిన వాటి నుంచి
ఎంపిక చేసిన ఈ చిత్రాలకు
'పిల్లలు కలలుగనే భారతదేశం'
అన్న శీర్షిక సరిపోతుంది.
ఈ పేజీలోని రెండు వర్ణచిత్రాలు
ఒక్కొక్క దానికి రూ. 500;
ఎదుటి పేజీలో వాటికి రూ. 300
బహుమతిగా అందజేస్తున్నాం.

ప్రీతి ఎం. సేట్ (14)
శ్రీ విద్యామందిర్ హైస్కూల్,
బెంగళూరు



నీలమాధబ్ మఝ్జీ
(14)
మిమలా కాన్వెంట్
స్కూల్,
భవానీ పట్న,
ఒరిస్సా



ఎస్. స్వరూప్ (15)
ఆదర్శ విద్యాలయ,
బెంగళూరు





భావన కె.బి. (10)
బి.జి.ఎస్. ఎడ్యుకేషన్ సెంటర్,
మంగళూరు



నితిన్ ఎన్. కుమార్
(12)
ఆదర్శ విద్యాలయ,
బెంగళూరు.

# స్వేచ్ఛా సంగీతం

రెండవ తరగతి చదువుతూన్న వంశీ చాలా తెలివైనవాడు. మంచి మార్కులు తెచ్చుకుంటూ ఉపాధ్యాయుల మెప్పు పొందేవాడు. తల్లిదండ్రులకు సంతోషం కలిగించేవాడు. ప్రకృతి అంటే వంశీకి చాలా ఇష్టం. ఆకాశంలో కదిలిపోయే మేఘాలు, మెరిసే నక్షత్రాలు, చుట్టుపక్కల చెట్టుచేమలు అన్నిటినీ అమితాసక్తితో పరిశీలించి చూసేవాడు. వాటన్నిటికీ మించి జంతువులన్నా పక్షులన్నా వంశీకి చెప్పలేనంత ప్రేమ. పక్షులు చేసే రకరకాల శబ్దాలు విని పులకించి పోయేవాడు. వాటిని అనుకరిస్తూ పక్షులతో స్నేహం చేసినంతగా సంబరపడిపోయేవాడు.

ఒకనాడు వంశీ, ''అమ్మా, మనుషులకు మాట్లాడే శక్తినిచ్చిన దేవుడు జంతువులకూ, పక్షులకూ ఎందుకు ఇవ్వలేదు?'' అని అడిగాడు తల్లిని.

''దేవుడు ప్రతి జీవికీ నోరునిచ్చాడు వంశీ. రకరకాల అరుపులతో, కూతలతో అవి తమలో తాము మాట్లాడుకుంటాయి. భావోద్వేగాలను అర్థం చేసుకుంటాయి. అంతెందుకు? కొన్ని జంతువులయితే మనిషి భాషను అర్థం చేసుకుంటాయి. నేర్పితే కొన్ని మాటలు కూడా నేర్చుకోగలవు,'' అన్నది తల్లి కొడుకును ఆప్యాయంగా దగ్గరికి తీసుకుంటూ.

ఒక రోజు సాయంకాలం బడి నుంచి తిరిగివస్తూన్న వంశీకి దారి పక్కన కాలువిరిగి పడి వున్న చిలుక కనిపించింది. జాలిపడ్డ వంశీ దాని దగ్గరికి వెళ్ళి దాన్ని చేతిలోకి తీసుకో బోయాడు. అంత బాధలోనూ అది వంశీని చూసి వెనక్కు జరిగింది. ''భయపడకు. నాతో వస్తే విరిగిన కాలికి కట్టుకట్టి, బాగు చేస్తాను. తియ్యటి పళ్ళిస్తాను. నువ్వు శక్తిని పుంజుకుని మామూలు స్థితికి రాగానే, నిన్ను స్వేచ్ఛగా వదిలి పెడతాను,'' అంటూ వంశీ దాన్ని మెల్లగా తన చేతుల్లోకి తీసు కుని ఇల్లు చేరాడు.



శుభ్రమైన నీళ్ళతో చిలుకగాయాన్ని కడిగి, తల్లిదండ్రుల సాయంతో మందు వేసి కట్టు కట్టాడు. పళ్ళు తినిపిం చాడు. మరునాడు తండ్రి తెచ్చిన పంజరంలో చిలుకను ఉంచి, పంజ రాన్ని పెద్ద తాడుతో వాకిట్లో ఉన్న



దానిమ్మ కొమ్మకు వేలాడ దీశాడు. ఇతర జంతువులు, పక్షులు పంజరాన్ని సమీపించకుండా తగు జాగ్రత్తలు తీసుకున్నాడు.

వంశీ చూపిన శ్రద్ధ కారణంగా చిలుక వారం రోజుల్లోనే కోలుకున్నది. హాయిగా లేచి గంతులు వేయడం మొదలు పెట్టింది. దాన్ని చూసి ఎంతో ఆనందించిన వంశీ, దానికి చిన్న చిన్న మాటలు నేర్పడం మొదలుపెట్టాడు. అంతేగాని, గాయం మానాక, చిలుకను స్వేచ్ఛగా వదిలి పెడతానని చెప్పిన మాటను మరిచిపోయాడు. అలా ఒక సంవత్సరం గడిచిపోయింది.

చిలుకను ఇంటికి తీసుకు వచ్చిన రోజు సందర్భంగా దానికి పుట్టిన రోజు పండుగ జరిపితే బావుంటుందని వంశీ తల్లిదండ్రులకు చెప్పాడు. వాళ్ళు సరే ననడంతో పంజరాన్ని రంగురంగుల కాగితాలతో అలంకరించాడు. ఆ రోజు ఆదివారం గనక స్నేహితులందరినీ పిలిచాడు. అయినా, చిలుకలో ఏమాత్రం ఉత్సాహం లేక పోగా, చాలా విచారంగా కనిపించింది. వంశీ దానికి పుట్టిన రోజు గురించీ, తాను దాని కోసం తెప్పించిన రకరకాల పళ్ళ గురించీ, రానున్న స్నేహితుల గురించీ చెప్పాడు. చిలుక అంతా వింటూ ఊరుకున్నదేగాని, నోరువిప్పలేదు. అంతవరకున్న సంతోషం కూడా కనిపించలేదు.

కారణం అంతుబట్టక, వంశీ మధ్యాహ్న భోజనం తరవాత, దాన్ని గురించి ఆలోచిస్తూ, అలాగే నిద్రపోయాడు.

''వంశీ, పుట్టిన రోజు పండుగను ఎవరికి ఏర్పాటు చేస్తున్నావు?'' అని అడిగింది చిలుక.

ఆ మాట వినగానే తడబడ్డ వంశీ, ''నీకే చిలకమ్మా'' అన్నాడు.

''అంటే, నాకు పండుగ గనక, ఈ రోజు నేను సంతోషంగా గడపాలి. పండుగరోజు అంటే బంధుమిత్రులతో హాయిగా గడపాలి. మరి నా మాటేమిటి? నన్ను పంజరంలో



బంధించావు. స్వేచ్ఛ లేకుండా చేశావు. నా బంధుమిత్రులకు దూరం చేశావు. గాయం మానాక వదిలి పెడతానని ఇచ్చిన మాట మరిచావు. నేనెలా సంతోషంగా ఉండగలను?'' అన్నది చిలుక.

వంశీ ఉలిక్కిపడి కళ్ళు తెరిచాడు. లేచి పంజరం వద్దకు మెల్లగా నడిచాడు. వణుకుతూన్న చేతులతో పంజరం తలుపు తీశాడు.

చిలుక వెలుపలికి గెంతి, తృప్తిగా రెక్కలల్లార్చింది. దాని కళ్ళల్లో అమితమైన ఆనందం కనిపించింది. రివ్వున ఎగిరి దాపులనున్న జామచెట్టు మీదికి వెళ్ళింది. ఊరంతా వినిపించేలా కిలకిలారావం చేసింది. దాని స్వరంలో ధ్వనించిన స్వేచ్ఛను గమనించిన మరికొన్ని చిలుకలు కిలకిలారావాలతో వచ్చి జామ చెట్టు మీద వాలాయి. చెట్టు వింత శోభను సంతరించుకున్నది.

ఆ దృశ్యాన్ని చూసి వంశీ, అతడి తల్లిదండ్రులు, మిత్రులు ఎంతో సంతోషించారు. అప్పుడు వంశీ తల్లి, ''చూశావా వంశీ! స్వేచ్ఛ కలగగానే చిలుక ఎంత సంతోషంగా ఉందో. స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు మనుషులకే కాదు. సకల జీవరాశులకూ అవసరం. మన భారతీయ సంస్కృతీ సంప్రదాయాలు చెప్పేది కూడా అదే. దేవుడు సర్వవ్యాపి అనడంలోని అంతరార్థం అదే. పావురం కోసం తన ప్రాణాలనే ఇవ్వడానికి సంసిద్ధుడైన శిబి చక్రవర్తి కథ నీకు తెలుసు కదా?'' అన్నది.

తల్లి మాటలు వింటూంటే వంశీ మనసు మరింత ఆనందంతో ఉప్పొంగింది.

–జి. జోసెఫ్ జోషి, సెయింట్ జాన్స్ చర్చ్ హైస్కూల్, సికింద్రాబాద్–500 026

**చందమామ ఇండియా క్విజ్–10 (నవంబర్ 2007) సమాధానాలు**

1. సి. పోర్బందర్ 2. బి. పుతలీబాయి 3. సి. మారిట్జ్‌బర్గ్
4. ఎ. బెల్గాం 5. సి. హరిజన్ 6. బి. గుజరాత్‌లోని సబర్మతి
7. ఎ. బీహార్‌లోని చంపారన్

# ఎండ-నీడ

అక్బర్ చక్రవర్తి ఆరోజు ఏదో విచారం నిండిన కోపంతో చాలా ముభావంగా కనిపించాడు. చక్రవర్తి విచారాన్ని పోగొట్టి సంతోషం కలిగిద్దామని బీర్బల్, ''ముభావంగా ఉండడం మీకంత బావుండదు ప్రభూ,'' అన్నాడు మెల్లగా.

''ఎప్పుడు ముభావంగా ఉండాలి? ఎప్పుడు మాట్లాడాలి? ఎప్పుడు నవ్వాలి? అన్నది ప్రభువులైన మాకు తెలుసు. మరొకరు చెప్పవలసిన అవసరం లేదు,'' అన్నాడు అక్బర్ ఆగ్రహంతో.

''ఆగ్రహంతో మీ ముఖం మరింత వికారంగా మారిపోతుంది ప్రభూ,'' అన్నాడు బీర్బల్.

''ఏమిటీ! నా ముఖం వికారంగా ఉందా? నా ఎదుటే ఆ మాట అనడానికి నీకెంత పొగరు?'' అన్నాడు అక్బర్ మరింత కోపంగా.

''నేనలా అనలేదు ప్రభూ,'' అంటూ బీర్బల్ మరేదో చెప్పేలోగా, ''నువ్వేం చెప్పనవసరం లేదు. ఇక్కడి నుంచి వెళ్ళిపో, ఇకపై నీ ముఖం నాకు చూపకు,'' అని ఆజ్ఞాపించాడు అక్బర్.

బీర్బల్ మరేమీ మాట్లాడకుండా సభ నుంచి వెళ్ళిపోయాడు.

''కొంచెం చనువిస్తే చాలు. ప్రతి ఒక్కడూ సలహాలిచ్చేవాడే. తలమీదికెక్కి కూర్చుంటాడు,'' అంటూ గొణుక్కున్నాడు అక్బర్. ఆ రోజంతా ఆయన ముభావంగానే ఉండిపోయాడు.

మరునాడు అక్బర్ సభకు వచ్చినప్పుడు అందరూ ఉన్నారు గాని, బీర్బల్ ఆసనం మాత్రం ఖాళీగా కనిపించింది.

''బీర్బల్ ఎక్కడ?'' అని అడిగాడు అక్బర్.

''తమరు ఆయన్ను ఇక్కడి నుంచి వెళ్ళిపొమ్మని ఆజ్ఞాపించారనీ, ఇకపై ముఖం చూపవద్దన్నారనీ-తమ ఆజ్ఞను శిరసావహించి ఊరు వదిలి వెళ్ళిపోతున్నానని చెప్పి వెళ్ళాడు ప్రభూ,'' అన్నాడు సంబంధిత అధికారి.





బీర్బల్‌తో నిన్న జరిగిన వాగ్వివాదం గుర్తుకు వచ్చి అక్బర్ ఒక నిమిషం ఆలోచనలో పడ్డాడు. తను నిన్న కోపంగా ఉన్న మాట నిజం. దాన్ని గుర్తు చేసిన బీర్బల్‌ను అంత కఠినంగా మందలించకుండా ఉంటే బావుండేదనిపించింది ఆయనకు. అయినా, తన మాటను అంత తీవ్రంగా తీసుకున్న బీర్బల్ పట్ల ఆయనకు జాలికలిగింది.

ఒక్కొక్కసారి అనుకోనివి కొన్ని జరిగిపోతూ ఉంటాయి. ఇప్పుడు అదే జరిగింది. బీర్బల్ వెళ్ళే చోటు చెప్పాపెట్టకుండా వెళ్ళిపోయాడు. రోజులు గడిచిపోతున్నా అతడి జాడ కనిపించలేదు. అతడు లేకుండా సభ చాలా వెలితిగా కనిపించింది అక్బర్ చక్రవర్తికి. అతడి కోసం అన్ని చోట్లా భటుల చేత వెతికించాడు. కాని ప్రయోజనం లేకపోయింది. అతన్ని ఎలాగైనా సభకు రప్పించాలని తీవ్రంగా ఆలోచించసాగాడు.

ఒకనాడాయన మంత్రులను సమావేశపరచి, ''పట్టపగలు రహదారిలో గొడుగు పట్టుకోకుండా నీడలో నడవగల వ్యక్తికి వంద మొహరీలు బహుమతి ఇవ్వగలనని రాజ్యమంతటా చాటింపు వేయించండి,'' అన్నాడు.

''ఇది అసాధ్యం కదా ప్రభూ! గొడుగు పట్టుకోకుండా ఎండలో నీడన నడవడం ఎవరికి సాధ్యం?'' అని విస్తుపోయాడు ఒక వృద్ధ ప్రముఖుడు.

''అలాగా! అయినా బహుమతి ప్రకటించడంలో నష్టపోయేదేమీ లేదు కదా?'' అని ఎదురుప్రశ్న వేశాడు చక్రవర్తి.

ఆ తరవాత మంత్రులేమీ మాట్లాడలేకపోయారు. వెనువెంటనే రాజ్యం నలుమూలలా చాటింపు వేయడం జరిగింది.

ఆ చాటింపు విని పలువురు పలువిధాలుగా మాట్లాడుకోసాగారు. ''పాలకులకు వింత వింత కోరికలుంటాయి,'' అని కొందరనుకుంటే, ''వంద మొహరీల ఖర్చు అన్నది ఖజానాకు ఎన్నటికీ రాదు,'' అని చెప్పుకుంటూ మరికొందరు నవ్వుకున్నారు.

మారుమూల గ్రామంలోని ఒక పేదవాడు ఆ చాటింపు విని, ''ఎండలో గొడుగు పట్టుకోకుండా నీడన నడవ గలిగితే వంద మొహరీలు బహుమతి,'' అని మళ్ళీ మళ్ళీ చెప్పుకుంటూ ఇంటికేసి నడిచాడు. అతడు తన జీవిత కాలంలో ఒక మొహరీ కూడా చూసి

ఎరుగడు. రాజు కోరింది గనక చేయగలిగితే తన దరిద్రం వదిలిపోతుందని భార్యతో చెప్పాడు.

''మన పొరుగున వచ్చి చేరిన బీరేంద్రను ఏదైనా ఉపాయం అడగవచ్చుకదా? అతడు చాలా తెలివైన వాడిలా కనిపిస్తున్నాడు,'' అన్నది భార్య.

''అంత మాత్రం తెలిస్తే, ఆయనే వెళ్ళి బహుమతి చేజిక్కించుకోగలడు కదా! అయినా, అడగడంలో పోయేదేమీ లేదు,'' అనుకుంటూ ఆపేదవాడు వెళ్ళి పొరుగింట్లో ఉన్న బీరేంద్రకు విషయం చెప్పాడు.

ఆ మాట విన్న బీరేంద్ర, ''అదేం అంత కష్టమైన పని కాదు,'' అన్నాడు చిన్నగా నవ్వుతూ.

''అదెలాగో నీకు తెలుసా? తెలిస్తే చెప్పు మరి,'' అని అడిగాడు పేదవాడు ఆత్రుతగా.

''తల మీద మంచం పట్టుకుని నడువు. ఎండలో నడుస్తున్నా, గొడుగు పట్టుకోక పోయినా, నీ మీద ఎండ పడదు. నీడలోనే నడవగలుగుతావు,'' అన్నాడు బీరేంద్ర.

''ఆహా, అద్భుతం! నాకా విషయం తోచనే లేదు. చక్రవర్తిని దర్శించడానికి ఇప్పుడే ఆగ్రాకు బయలుదేరి వెళతాను. వంద మొహరీలు నావే,'' అంటూ అతడు అక్కడినుంచి పట్టరాని ఉత్సాహంతో బయలుదేరాడు.

పేదవాడు అప్పటికప్పుడే బయలుదేరి హుటాహుటిగా ఆగ్రాను చేరుకుని అక్బర్ చక్రవర్తిని దర్శించి, ''ప్రభూ, రాజభవనానికి ఎండలోనే వచ్చాను. గొడుగు పట్టుకుని రాలేదు. అయినా నా మీద ఎండపొడ సోకలేదు. నీడనే నడిచివచ్చాను,'' అన్నాడు.

''అలా రావడం అసాధ్యమని అందరూ అన్నారు. మరి నీకెలా సాధ్యమయింది?'' అని అడిగాడు అక్బర్.

''తల మీద మంచం పట్టుకుని మరీ నడిచి వచ్చాను, ప్రభూ,'' అన్నాడు పేదవాడు.

''శభాష్. ప్రకటించిన బహుమతిని నీకు తప్పక ఇప్పిస్తాను. అది సరే, నీకీ ఆలోచన స్వయంగా వచ్చిందా? ఎవరైనా చెప్పారా?'' అని అడిగాడు అక్బర్.

''ఆగ్రా నుంచి బీరేంద్ర అనే ఒకాయన ఈ మధ్య గ్రామానికి వచ్చి మా పొరుగున చేరాడు. ఆయన చాలా తెలివైనవాడు. ఆయనే నాకీ ఉపాయం చెప్పాడు,'' అన్నాడు పేదవాడు.



బీరేంద్ర తప్పక బీర్బల్ అయి వుంటాడని అక్బర్ గ్రహించాడు. వెంటనే ఆయన పేదవాడికి వంద మొహరీలు బహుమతిగా ఇచ్చి, ''నువ్వు సురక్షితంగా ఇల్లు చేరాలి గనక, నీకు తోడుగా ఇద్దరు భటులను పంపుతాను. వాళ్ళు తిరిగి వచ్చేప్పుడు నీ పొరుగున ఉన్న బీరేంద్రను వాళ్ళతో పంపించు,'' అన్నాడు.

పేదవాడు అక్బర్‌కు నమస్కరించి పరమానందంతో తిరుగు ప్రయాణమయ్యాడు.

ఒకవారం తరవాత భటులు ముఖానికి తువ్వాలు చుట్టుకుని వున్న బీరేంద్రను వెంట బెట్టుకుని రాజు సమక్షానికి వచ్చారు.

''ముఖం కనిపించకుండా తువ్వాలును ఎందుకు అడ్డంగా చుట్టుకున్నావు?'' అని అడిగాడు అక్బర్ బీరేంద్రను.

''నా ముఖం చూపకూడదని తమరే ఆజ్ఞాపించారు ప్రభూ! రాజాజ్ఞ జవదాటకూడదు కదా?'' అన్నాడు బీరేంద్ర వినయంగా.

''బీర్బల్! ఇప్పుడు నీ ముఖం చూడాలనుకుంటున్నాను,'' అంటూ ముఖానికి అడ్డంగా ఉన్న తువ్వాలును తొలగించి అతణ్ణి ఆప్యాయంగా కౌగిలించుకున్నాడు అక్బర్.

## మన దేశం క్విజ్

**జనవరిలో రిపబ్లిక్ దినోత్సవసందర్భంగా అవార్డులు ఇస్తారు. ఈ నెలలో అవార్డుల గురించి తెలుసుకుందాం**

1. ధైర్యసాహసాలకు ఇచ్చే అత్యున్నతమైన అవార్డు ఏది?
ఎ) వీర్‌చక్ర బి) పరంవీర్ చక్ర
సి) మహావీర్ చక్ర





2. ఏ రంగంలో ఉత్తమకృషి చేసినవారికి దాదాఫాల్కే పురస్కారం ఇస్తారు?
ఎ) సాహిత్యం బి) విజ్ఞాన శాస్త్రం సి) సినిమా

3. నోబెల్ బహుమతీ గ్రహీతల పేర్లు; కృషి చేసిన రంగాలు ఇవ్వబడ్డాయి. వాటిని జత చేయండి.
ఎ) సి.వి. రామన్
బి) డా. చంద్రశేఖర్
సి) హర్‌గోవింద్ ఖొరానా

1. భౌతికశాస్త్రం 2. జన్యుశాస్త్రం 3. భౌతికశాస్త్రం



5. ద్రోణాచార్య పురస్కారం ఏ రంగంలో కృషిచేసిన వారికి ఇస్తారు?
ఎ) బోధనా రంగం
బి) క్రీడల కోచింగ్
సి) సర్కస్ ట్రెయినింగ్

(సమాధానాలు 82వ పేజీలో)

## మనదేశపు ఏడు అద్భుతాలు



ఇటీవల ఏడు ప్రపంచ అద్భుతాల ఎంపిక జరిగి, అందులో మన తాజ్‌మహల్ చోటుచేసుకున్న విషయం తెలిసినదే. ఇప్పుడు టైమ్స్ ఆఫ్ ఇండియా గ్రూపు పత్రికలు మనదేశపు ఏడు అద్భుతాల గురించి అభిప్రాయ సేకరణ జరిపాయి. వాటిలో కర్నాటక రాష్ట్రం శ్రావణ బెళగొళలోని పదిహేడు మీటర్ల ఎత్తయిన బాహుబలి ఏకశిలా విగ్రహానికి ఎక్కువ ఓట్లు రావడం విశేషం. తక్కిన ఆరు అద్భుతాలు: అమృతసర్ స్వర్ణదేవాలయం; తాజ్‌మహల్; హంపీ శిథిలాలు; కోణార్క సూర్యదేవాలయం; 3,000 సం.లకు పూర్వం వెలసిన నలంద విశ్వవిద్యాలయ ప్రాంతం; ఖజురహో శిల్పసముదాయం.

## పాదుకలకు పాము రక్షణ



లండన్‌లోని సుప్రసిద్ధ హారోడ్స్ డిపార్ట్‌మెంటల్ స్టోర్ రూ. 51 లక్షల విలువైన పాదుకలను ప్రదర్శనకు ఉంచింది. వజ్రాలు, మణులు, మాణిక్యాలు పొదిగిన ఆ జత పాదుకలను 'ది రేనే కావోవిల్లా' తయారు చేసింది. వాటిని ప్రదర్శనకు ఉంచినప్పుడు పక్కనే ఈజిప్టు త్రాచుపామును కాపలాకు ఉంచారు.

## హిందూమత ప్రార్థనతో అమెరికా సెనేట్ ఆరంభం

నార్త్ నెవాడాలో హిందూ ఆలయ పబ్లిక్ అఫెయిర్స్, ఇంటర్‌ఫెయిత్ రిలిజియన్ డైరెక్టర్ రాజన్ జేద్ గాయత్రీ మంత్రాలాపనతో అమెరికా సెనేట్ ఆగస్ట్ 13వ తేదీ సమావేశం ఆరంభమయింది. 1789లో సెనేట్ ఏర్పాటయినప్పటి నుంచి ఇలా జరగడం ఇదే ప్రథమం. గనక, దీన్నొక చారిత్రాత్మక ఘట్టంగా చెబుతున్నారు. జేద్ గంగా జలాలను వేదిక మీద చిలకరించి 'ఓం శాంతి శాంతి శాంతిః' అనే శాంతి పాఠంతో పూర్తిచేశాడు.



మహనీయుల జీవితాల్లో ఆసక్తికర ఉదంతాలు (25)

# చక్రవర్తి చివరి ఆజ్ఞ

మధ్య యుగాల చరిత్రలో సుల్తాన్ సలాదీన్ (1138-1193) పేరు మరువరానిది. ఈజిప్ట్, సిరియా రాజ్యాల చక్రవర్తిగానే గాక పరిసర ప్రాంతాలను జయించిన వీరుడుగానూ ఆయన ప్రసిద్ధిగాంచాడు.

ఒకసారి సుల్తాన్ జెరూసలెంను పట్టుకోవడానికి సేనలతో బయలుదేరాడు. ఆ సమయంలో ఆ పవిత్ర నగరం, ధైర్యసాహసాలకు పేరుగాంచిన ఇంగ్లాండు రాజు రిచర్డ్ అధికారంలో ఉన్నది. ఆయనే స్వయంగా సేనలకు నాయకత్వం వహించి సలాదీన్‌ను ఎదుర్కొన్నాడు. ఉభయసేనలకు మధ్య భయంకర యుద్ధం జరిగింది. అయితే, ఒక్కొక్క ఘట్టంలోనూ సలాదీన్ తన ఉదాత్త గుణాన్ని ప్రదర్శించాడు. అలసిపోయిన కింగ్ రిచర్డ్‌కు, ఆయన దళనాయకులకు అప్పటికప్పుడు ఆహార పానీయాలను అందజేసేవాడు. ఒక సందర్భంలో యుద్ధరంగంలో కింగ్ రిచర్డ్ ఎక్కిన గుర్రం తీవ్రంగా గాయపడి, నేలకు ఒరిగింది. రాజూ కింద బడ్డాడు. మరే శత్రువైనా ఆ దృశ్యాన్ని చూసి ఉంటే, వికటాట్టహాసం చేసి ఉండేవాడే. నిజానికి సలాదీన్ సైనికులు సైతం కింగ్ రిచర్డ్ తల తెగనరకడానికి కత్తులు దూసి ముందుకు ఉరుకుతూ సుల్తాన్ ఆజ్ఞ కోసం ఆయన కేసి చూశారు.



అయితే, సలాదీన్ పక్కకు తప్పుకోమని వారిని ఆజ్ఞాపించాడు. తను గుర్రంపైనుంచి కిందికి దిగి, ఒక ఉత్తమాశ్వాన్ని ఇంగ్లీషు రాజుకు తెచ్చి ఇవ్వమన్నాడు. కొత్త గుర్రం మీద ఆయన సక్రమంగా అదుపు సాధించిన తరవాతే యుద్ధం చేయడం మొదలుపెట్టారు.

ఆఖరికి ఇంగ్లీష్ సేనలు తిరుగు ముఖం పట్టవలసి వచ్చింది. జెరూసలెం సలాదీన్ వశమయింది.

''ఆహా! సాటిలేని పరాక్రమవంతులు. ధైర్యసాహసాలలో, సిరిసంపదలలో మీతో

సరితూగ గల శక్తివంతులు భూమండలంలో లేరు, ప్రభూ,'' అంటూ సలాదీన్ మిత్రులు, అభిమానులు ముక్త కంఠంతో కీర్తించారు.

ఆ పొగడ్తలకు సలాదీన్ పొంగిపోలేదు. మందహాసం చేస్తూ తలపంకించాడు. అంతే! అయినా మిత్రులు మాత్రం తమ పొగడ్తలకు చక్రవర్తి సంతసించాడనే భావించారు.

కొన్నాళ్ళకు సుల్తాన్ హఠాత్తుగా అస్వస్థతకు లోనయ్యాడు. గొప్ప గొప్ప వైద్యులు వచ్చి వైద్యం చేశారు. అయినా, ఆయన కోలుకోలేదు. అశాంతితో కనిపించాడు.

''మహా ప్రభూ! తమరు ప్రపంచాన్నే జయించారు. సర్వం మీ అదుపాజ్ఞలలో ఉన్నాయి. ఏం చేయాలో ఆజ్ఞాపించండి. మీ ఆజ్ఞను నెరవేర్చడానికి మేమందరం సిద్ధంగా ఉన్నాం,'' అన్నారు మంత్రులు, ప్రముఖులు.

సుల్తాన్ మందహాసం చేశాడు. మిత్రులు తనను కీర్తించినప్పుడు చేసిన అదే చిరుదరహాసం అది! ఆ తరవాత నెమ్మదిగా, దృఢమైన కంఠస్వరంతో ఇలా చెప్పాడు: ''మిత్రులారా! సర్వం నా అదుపాజ్ఞలలో ఉన్నదనే కదా మీరు భావిస్తున్నారు. చాలా కృతజ్ఞతలు. ఇప్పుడు



నేను చెప్పినట్టు చేయండి. నా మీద కప్పబడే వస్త్రాన్ని అంటే, మరణానంతరం నా మీద కప్పి పాతిపెట్టే వస్త్రాన్ని తీసుకోండి. దాన్ని నగర వీధుల్లో ఊరేగింపుగా తీసుకువెళుతూ, 'గొప్ప విజేత సలాదీన్ తన వెంట తీసుకువెళ్ళనున్నది ఇదే!' అని ప్రజలకు తెలియజేయండి!''

-(ఎం.డి)

చందమామ ఇండియా క్విజ్ - 10 (నవంబర్ '07) విజేతలకు అభినందనలు:

1. తీర్థశ్రీ, యాప్రాల్, రంగారెడ్డి జిల్లా - 500 087 (ఆం.ప్ర)
2. బి. తేజ, అంబర్‌పేట, హైదరాబాద్ - 500 007 (ఆం.ప్ర)
3. జి.వి. సుధ, కోట, గూడూరు - 524 411 (ఆం.ప్ర)
4. మతుకుమల్లి లలిత, మెహదీపట్నం, హైదరాబాద్ - 500 026 (ఆం.ప్ర)
5. సాయి సువర్చల నీహారిక, గుడివాడ, కృష్ణా జిల్లా (ఆం.ప్ర)

# చందమామ ఇండియా క్విజ్ - 12

Co-sponsored by
Infosys FOUNDATION, Bangalore

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి రూ. 250లు.*

ఈ వరుసలో ఇది చివరి క్విజ్. మనదేశానికి సంబంధించిన విభిన్న విషయాల గురించి ఈ నెల క్విజ్‌లో గుర్తుచేసుకుందాం.

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్టయితే బహుమతి మొత్తం డ్రా ద్వారా తీసిన ఐదుగురికి సమానంగా పంచబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే : 1. సమాధానాలు రాయండి. 2. మీ పేరు, వయసు (16 ఏళ్ళలోపు ఉండాలి) పిన్‌కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి. 3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి. 4. కవరు మీద చందమామ ఇండియా క్విజ్- 12 అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి. 5. జనవరి నెలాఖరులోగా మీ ఎంట్రీ మాకు అందాలి. 6. మార్చ్ 2008 నెల సంచికలో ఫలితాలు వెలువడతాయి.



1. ఒలింపిక్ క్రీడల్లో మన దేశం ఎప్పుడు హాకీలో తొలిసారిగా బంగారు పతకం సాధించింది?
   ఎ) 1924 బి) 1928 సి) 1932 డి) 1936
2. ఏ సంస్థానాధిపతి టెలిస్కోప్ తెప్పించడం కోసం 1730లో ఇంగ్లాండుకు 'జోస్యూట్ మిషన్' పంపాడు?
3. మన దేశంలో 1969లో ఎన్ని బ్యాంకులు జాతీయీకరణ చేయబడ్డాయి?
   ఎ) 16 బి) 14 సి) 12 డి) 10
4. ఒకనాటి చాళుక్యుల రాజధాని అయిన 'వాతాపి' ఇప్పటి పేరేమిటి?
5. పుస్తక ప్రచురణలో మనదేశం ఎన్నో స్థానంలో ఉన్నది?
   ఎ) నాలుగవ బి) ఐదవ సి) ఆరవ డి) ఏడవ
6. పృథ్వీరాజ్ చౌహాన్ ఢిల్లీలో నిర్మించిన కోట పేరేమిటి?
7. 'నౌతంకి' అనే జానపద నాటకాలకు ప్రసిద్ధిగాంచిన రాష్ట్రం ఏది?
   ఎ) ఉత్తర ప్రదేశ్ బి) మధ్య ప్రదేశ్ సి) బీహార్ డి) హర్యానా

## ఉత్తరప్రదేశ్ జానపద కథ

# చిలుక జోస్యం!

మదన్‌పూర్ మహారాజుకు ఇద్దరు కుమారులు. జిత్తు, వీర్ అనే ఆ ఇద్దరు చాలా అందమైన వాళ్ళేగాక తెలివైనవాళ్ళని కూడా పేరు తెచ్చుకున్నారు. హఠాత్తుగా రాణికి జబ్బు చేసింది. ఆస్థాన వైద్యులు ఎన్ని చికిత్సలు చేసినప్పటికీ ఆమె జబ్బును నయం చేయలేకపోయారు. ఒకనాడు ఆమె భర్తను దగ్గరికి పిలిచి, ''మన పిల్లల క్షేమం ముఖ్యం. వారికోసం దయచేసి మళ్ళీ వివాహం చేసుకోకండి,'' అన్నది. రాజు ఆమె చేతులు పట్టుకుని, ''నీ కోరిక ప్రకారమే జరుగుతుంది,'' అన్నాడు. రాణి ఆ మాట విని ప్రశాంతంగా కన్నుమూసింది.

మహారాణి ప్రజాక్షేమం పట్ల శ్రద్ధగల కరుణామయి గనక, ఆమె మరణానికి మహారాజు మాత్రమే కాకుండా రాజ్య ప్రజలందరూ విషాదం చెందారు. కొన్నాళ్ళు గడిచింది. మహారాణి లేకుండా మహారాజు మాత్రమే సింహాసనంపై ఆసీనుడు కావడం ప్రజలకు బాధ కలిగించింది. రాజు ద్వితీయ వివాహం చేసుకోవడం అన్ని విధాలా శ్రేయస్కరమని భావించసాగారు.

ఒకనాడు ప్రధానమంత్రి రాజుతో, ''తమరు ద్వితీయ వివాహం చేసుకోవాలి. రాజ్యానికి మహారాణి కావాలని ప్రజలు కోరుకుంటున్నారు,'' అన్నాడు.

ఆ మాట విని రాజు ఆలోచనలో పడ్డాడు. మొదటి రాణికి ఇచ్చిన మాట; పిల్లల భవిష్యత్తు తలుచుకుని కొంతసేపు ఒక నిర్ణయానికి రాలేకపోయాడు. కొంతసేపు ఏమీ మాట్లాడలేక పోయాడు. ఆ తరవాత తలపంకిస్తూ, ''సరే, ప్రజాభీష్టం నెరవేర్చడం రాజుగా నా బాధ్యత. మళ్ళీ వివాహమాడతాను,'' అన్నాడు.

రాజును వివాహమాడిన కొత్త రాణి, తన అదృష్టానికి ఎంతగానో పొంగిపోయింది. రాజును చాలా ప్రేమతో చూసుకుంటూ ఆయన కనుసన్నలలో మెలగసాగింది. అయితే, రోజులు గడిచే కొద్దీ, రాజు తన కుమారుల పట్ల చూపు





తూన్న ఆప్యాయతను చూసి సహించలేక పోయింది. దానికి తోడు రాజుకు తరవాత ఆ ఇద్దరిలో ఒకరే సింహాసనాన్ని అధిష్ఠించగలరు గనక, తనకు కలగబోయే సంతానానికి రాజ్యార్హత ఉండదని ఆలోచించడంతో ఆమెకు రాజకుమారుల పట్ల ఎనలేని ద్వేషభావం పుట్టుకు వచ్చింది. తన భవిష్యత్తు బావుండాలంటే ఆ ఇద్దరి అడ్డు ఉండకూడదని భావించి ఒక నిర్ణయానికి వచ్చింది.

ఒకనాడు రాజు వేటకు వెళ్ళాడు. రాణి, ఇద్దరు రాజకుమారులు మాత్రమే భవనంలో ఉన్నారు. రాణి తీవ్రంగా ఆలోచించింది. వంటవాడు లేని సమయం చూసి, వంటగదిలోకి వెళ్ళి, మండుతూన్న కొరివిని తీసి నుదుటి మీద, చేతుల మీద గాయపరచుకున్నది. రాజు తిరిగి రాగానే, ''చూశారా, మీ ముద్దుల కుమారులు చేసిన అఘాయిత్యం! నా ప్రాణానికే ముప్పు వచ్చి పడింది. వాళ్ళు సమీపంలో ఉంటే నా ప్రాణానికి రక్షణ ఉండదు. ఇక్కడి నుంచి వాళ్ళయినా వెళ్ళాలి. లేకుంటే నేనైనా వెళ్ళిపోవాలి!'' అంటూ జుట్టు విరబోసుకుని నానా రాద్ధాంతం చేసింది.

రాజు ఆమె మాటలు నమ్మాడు. సవతి తల్లి పట్ల అయిష్టం కారణంగా పసిపిల్లలు ఆ పని చేసి వుండవచ్చని ఆయన భావించాడు. అయితే, ఆ విషయం గురించి వారిని ఏమీ అడగలేదు. అలాంటి అఘాయిత్యం మరెప్పుడూ చేయకుండా పిల్లలకు సరైన గుణపాఠం నేర్పాలని నిర్ణయించాడు.

అప్పటికప్పుడే కొడుకులిద్దరనీ రథంలో ఎక్కించుకుని అడవిని సమీపించిన రాజు, వాళ్ళను అక్కడ దించి, ''మీరిద్దరూ ఇక్కడే కూర్చోండి. నేను ఆవలివైపుకు వెళ్ళివస్తాను,'' అన్నాడు.

ఒక రాత్రంతా పిల్లలను అక్కడ ఉంచి, తెల్లవారాక వచ్చి తీసుకువెళితే, వాళ్ళకూ బుద్ధి వస్తుంది; అంతలో రాణి కోపం కూడా చల్లారి, శాంతిస్తుందని రాజు ఆశించాడు.

అడవిలో కూర్చున్న జిత్తు, వీర్ ఎంతసేపటికీ తండ్రి తిరిగి రాకపోయేసరికి, అక్కడి నుంచి లేచి చుట్టుపక్కల వెతికారు. ఆయన జాడ కనిపించలేదు. సూర్యుడు అస్తమించి చీకటి కమ్ముకోసాగింది. అన్నదమ్ములు రాత్రిని అడవిలోనే గడపాలనుకున్నారు. ఒక చెట్టుకింద ఒకరు నిదురబోతున్నప్పుడు, మరొకరు మేలుకుని కాపలా ఉండాలని నిర్ణయించారు. చుట్టుపక్కల ఉన్న చితుకులను ఏరి చలిమంట వేశారు.

చెట్టుకొమ్మ మీది చిలుకాగోరింకలు రాజ కుమారుల చర్యలను ఎంతో ఆసక్తిగా గమనించ సాగాయి. ''పాపం పసిపిల్లలు. ఏమీ తినలేదు. ఆకలితో ఉన్నట్టున్నారు,'' అన్నది చిలుక.

''మనం వెళ్ళి వెతికినా ఈ అపరాత్రి వేళ వాళ్ళకు ఎలాంటి ఆహారం తీసుకురాగలం? నేనొకటి చెప్పనా?'' అని బదులు పలికింది గోరింక.

''నీ మనసులో ఏమున్నదో చెప్పుమరి. కేవలం సానుభూతి చూపడం వల్ల ప్రయోజనం ఉండదు కదా!'' అన్నది చిలుక.

''ఆ పిల్లల ఆకలి తీర్చాలంటే నాకు ఒకటే మార్గం కనిపిస్తున్నది. మండుతున్న చలిమంట ల్లోకి మనం దూకేద్దాం. మనల్ని కాల్చుకుని తిని వాళ్ళు ఆకలి తీర్చుకుంటారు. ఏమంటావు?'' అన్నది గోరింక.

''బావుంది. ఇతరుల ఆకలి తీర్చడానికి మించిన ఉపకారం ఏముంటుంది? పైగా వాళ్ళు మన అతిథుల్లాంటివారు. మరో విషయం. నా మాంసం తిన్నవాడు భవిష్యత్తులో రాజూ, నీ మాంసం తిన్నవాడు మంత్రీ కాగలడు,'' అన్నది చిలుక.

భవిష్యత్తును చూడగల శక్తి వున్న ఆ పక్షులు కూడబలుక్కుని, మొదట చిలుక, దాన్ని అనుస రించి గోరింక చలిమంటల్లోకి దూకేశాయి.

ఆ సమయంలో జిత్తు నిదురపోతున్నాడు. మేలుకుని వున్న వీర్ పక్షులు చేసిన పనిని చూసి ఆశ్చర్యపోయి అన్నను తట్టి లేపి, ''అన్నయ్యా, మనం ఆకలితో బాధపడనవసరం లేదు. రెండు పక్షులు మంటల్లోకి దూకేశాయి. వాటిని కాల్చి తిందాం,'' అన్నాడు.

''అలాగే తమ్ముడూ. నువ్వు పెద్ద దాన్ని తిను. నేను చిన్నదాన్ని తింటాను,'' అన్నాడు జిత్తు.

''నువ్వు పెద్దవాడివి గనక, పెద్దదాన్నీ, నేను చిన్నవాణ్ణి గనక, చిన్నపక్షినీ తిందాం,'' అన్నాడు వీర్.

ఆ సూచనకు జిత్తు అంగీకరించడంతో, అదే విధంగా వాళ్ళు పక్షులను కాల్చుకు తిని ఆకలి తీర్చుకుని పడుకుని హాయిగా నిద్ర పోయారు.

తెల్లవారాక కూడా చాలా సేపటివరకు తండ్రి రాకపోయేసరికి, ఏం చేద్దామా అని ఆలోచిస్తూ కూర్చున్నారు.

హఠాత్తుగా ఒక అందమైన జింక అటుకేసి పరిగెత్తడం చూసిన జిత్తు, ''తమ్ముడూ రా. ఆ జింకను పట్టుకుందాం,''అంటూ జింకవెంట పరిగెత్తాడు. అలా చాలా దూరం పరిగెత్తాక,





జింక దూరంలో ఉన్న పొదల చాటుకు వెళ్ళి, కనుమరుగై పోయింది. అక్కడ ఆగిన జిత్తు తమ్ముడి కోసం వెనుదిరిగి చూశాడు. వీర్ కనిపించలేదు. అక్కడే ఒక చెట్టుకింద బండ మీద కూర్చున్నాడు.

ఎంతసేపటికీ తమ్ముడు రాకపోయేసరికి, లేచి ముందుకు నడిచాడు. అడవి ఆవలి ప్రాంతాన్ని చేరుకున్నాడు. అది వేరొక రాజ్యం అక్కడి ప్రజలందరూ విచారగ్రస్తులై ఉండడం చూసి ఆశ్చర్యపోయాడు. కారణం అడిగితే రాజు మరణించాడనీ, ఆయన అంతిమ యాత్రను చూడడానికి ప్రజలు అక్కడ చేరారనీ చెప్పారు. జిత్తు కూడా బాటకు ఒకవైపున జనం మధ్యకు వెళ్ళి నిలబడ్డాడు.

కొంతసేపటికి ఊరేగింపు అటుగా రాసాగింది. అలంకరించబడిన పల్లకిలో రాజుగారి భౌతిక కాయాన్ని మోసుకువస్తున్నారు. ఊరేగింపుకు ముందు రాజగురువు నడుస్తున్నాడు. ఆయన దృష్టి జనం మధ్య నిలబడివున్న జిత్తు మీద పడింది. భటుణ్ణి పంపి అతణ్ణి దగ్గరికి పిలిచి, ''మా రాజుగారు మరణించారు. ఆయనకు సంతానం లేదు. నీలో రాచఠీవి ఉట్టిపడుతున్నది. నువ్వు తప్పక రాజవంశానికి చెందినవాడివై ఉండాలి. మా రాజుగారి అంత్యక్రియలు నీ చేతుల మీదుగా నిర్వహించు. యుక్త వయస్కుడివయ్యాక రాజ్యసింహాసనాన్ని అధిష్ఠించవచ్చు,'' అన్నాడు.

రాజగురువు మాటలు జిత్తుకు పూర్తిగా అర్థంకాక పోయినప్పటికీ, తాను ఆ రాజ్యానికి మునుముందు రాజునయ్యే అవకాశం ఉందన్న విషయం మాత్రం అర్థమయింది. తననూ తన తమ్ముణ్ణీ అడవిపాలు చేసివెళ్ళిన తన తండ్రిని తలుచుకున్నాడు. వెంటనే మరణించిన రాజుకు అంత్యక్రియలు నిర్వహించడానికి, ఊరేగింపుతో పాటు రాజగురువు వెంట నడిచాడు.

రాజగురువు పర్యవేక్షణలో జిత్తు చేతుల మీదుగా రాజుగారి అంత్యక్రియలు జరిగిపోయాయి. జిత్తును రాజభవనానికి తీసుకు వెళ్ళారు. మరునాడు రాజగురువు సభను సమావేశ పరచి, ''మన మహారాజుకు వారసుడు లభించాడు,'' అని ప్రకటించాడు. ఆ తరవాత మహారాణి కేసి చూశాడు.

''ఈ రాజకుమారుడు, మహారాజుగారికి తగిన వారసుడని భావిస్తున్నాను. రాజగురువు

అభిప్రాయాన్ని హృదయపూర్వకంగా అంగీకరిస్తున్నాను,'' అన్నది మహారాణి.

రాజకుమారుడు జిత్తు, జితేంద్రుడు అనే పేరుతో ఆ రాజ్యానికి యౌవరాజుగా అభిషిక్తుడయ్యాడు.

అదే సమయంలో జింకను పట్టడానికి పరిగెత్తిన అన్న వెంట చాలా దూరం పరిగెత్తిన వీర్ అలిసిపోయి ఒక బండమీద కూర్చున్నాడు. ఆ తరవాత పరిగెత్తలేక, అన్నను కలుసుకోగలనో, లేదో అని విచారపడసాగాడు. అప్పుడు ఆదారిలో వచ్చిన ఒక వృద్ధుడు, ''నువ్వెవరు? ఇక్కెడెందుకు ఒంటరిగా కూర్చున్నావు?'' అని అడిగాడు.

''మా అన్ననూ, నన్నూ మా తండ్రి రాత్రి అడవిలో వదిలివెళ్ళాడు. రాత్రంతా అడవిలో గడిపాము. తెల్లవారాక ఒక జింక కనిపించడంతో దాన్ని పట్టుకోవడానికి మా అన్న వెళ్ళాడు. నేను అతని వెంట కొంత దూరం పరిగెత్తి ఆ తరవాత పరిగెత్తలేక ఆగిపోయాను. మా అన్నను చూడగలనో లేదో తెలియడం లేదు,'' అన్నాడు వీర్ విచారంగా.

''మీ అన్నను గురించి విచారించకు. పొద్దుపోయి చీకటి పడుతున్నది. రేపు వెతుకుదాం. ఇప్పుడు నా వెంటరా, వెళదాం,'' అన్నాడు ఆ వృద్ధుడు.

వీర్ వృద్ధుడి వెంట బయలుదేరాడు. మార్గమధ్యంలో తాను ఎవరైనదీ వీర్ ఆయనకు చెప్పాడు. కొంత సేపటికి వాళ్ళొక పెద్ద భవనాన్ని సమీపించారు. అది ఆ వృద్ధుడి ఇల్లే. ''మీ అన్న కనిపించేంతవరకు నువ్వు ఇక్కడే ఉండవచ్చు. నీకు ఎలాంటి కొరతా లేకుండా నేను చూసుకుంటాను,'' అన్నాడు వృద్ధుడు.

వీర్ అందుకు సమ్మతించడంతో, ఆ ప్రాంతానికి జమీందారయిన ఆ వృద్ధుడు అతనికి ఆహార పానీయాలూ సకల సదుపాయాలూ సమకూర్చడమే కాకుండా విద్యాబోధనకు కూడా ఏర్పాటు చేశాడు. కొన్ని సంవత్సరాలు గడిచిపోయాయి.

ఒకనాడు పొరుగురాజ్యంలో యుక్తవయస్కుడైన యువరాజుకు పట్టాభిషేకం జరుగనున్నదని వృద్ధ జమీందారుకు తెలిసింది. సంతానం లేని ఆ రాజు మరణించడంతో అంత్యక్రియలు నిర్వహించిన పొరుగుదేశపు రాకుమారుణ్ణి రాజగురువు సింహాసనానికి వారసుడిగా ఎంపిక చేశాడన్న సంగతి కూడా జమీందారుకు తెలియవచ్చింది. దాంతో ఆ





యువరాజు జితేంద్రుడు, వీర్ అన్న జిత్తు అయివుండవచ్చునన్న అనుమానం ఆయనకు కలిగింది.

జమీందారు తన అనుమానాన్ని బయట పెట్టకుండా వీర్‌ను వెంటబెట్టుకుని యువ రాజు పట్టాభిషేక మహోత్సవం చూడడానికి బయలుదేరాడు. పట్టాభిషేకం ఘనంగా జరి గింది. ఆ తరవాత రాజును దర్శించడానికి వెళ్ళిన జమీందారు, ''అడవిలో జింకను పట్టడా నికి వెళ్ళిన అన్న వెంట పరిగెత్తలేక వెనకబడి ఆగిపోయిన తమ్ముడు తమకు గుర్తున్నాడా ప్రభూ!'' అని అడిగాడు.

వృద్ధ జమీందారు పక్కనే నిలబడ్డ యువ కుణ్ణి ఒక క్షణం పరిశీలనగా చూసిన రాజు జితేంద్రుడు, తటాలున సింహాసనం నుంచి లేచి, ''తమ్ముడూ, వీర్!'' అంటూ వచ్చి అతణ్ణి ఆప్యాయంగా కౌగిలించుకున్నాడు. ''తప్పి పోయిన నా తమ్ముడు మళ్ళీ నావద్దకు రావడం నాకెంతో సంతోషం కలిగిస్తున్నది. పట్టాభిషే కానికన్నా మహదానందం కలిగించిన రోజు ఇది!'' అంటూ సభికుల కేసి తిరిగి, ''వీర్, నా సహోదరుడు. దురదృష్టవశాత్తు చిన్నప్పుడు విడిపోయిన మేము ఇప్పుడు అదృష్టవశాత్తు చాలా సంవత్సరాల తరవాత కలుసుకుంటున్నాం. వీర్‌ను వీరేంద్రుడనే పేరుతో నా ప్రధాన మంత్రిగా నియమిస్తున్నాను!'' అన్నాడు.

ఆ విధంగా సంవత్సరాల క్రితం చిలుక చెప్పిన మాట నిజమయింది.



# కలల మర్మం

కోసలదేశానికి రాజైన బింబిసార మహా రాజుకు ఒకనాటి రాత్రి చాలా విడ్డూరమైన కలలు వచ్చాయి. మర్నాడు మహారాజు బ్రాహ్మణులను పిలిపించి, తనకు వచ్చిన కలల గురించి చెప్పి, ''ఇటువంటి స్వప్నాలకు ఫలితం ఏమిటో ఆలోచించి చెప్పండి!'' అని కోరాడు.

బ్రాహ్మణులు రాజు నుంచి అంతులేని ధనం గుంజుకోవటానికి ఇది మంచి అవకాశంగా భావించి, ''మహారాజా, మీకు వచ్చిన కలలు చాలా ప్రమాదం కలిగించేవి. వాటి వల్ల మీకూ, మీ వంశానికీ, మీ రాజ్యానికీ, మీ ప్రజలకు కూడా గొప్ప అరిష్టం కలగనున్నది!'' అని చెప్పారు.

ఈ మాటలు వినగానే రాజుకు మతి పోయినట్టయింది. ''అయితే, ఈ అరిష్టాలను నివారించే మార్గం ఏమిటి?'' అని అడిగాడు.

''దీనికల్లా ఒకటే విరుగుడు. మన రాజ్యంలో నాలుగు దారులు కలిసిన చోట నల్లా ఒక యజ్ఞం చేయించండి. యజ్ఞం ముగిశాక బ్రాహ్మణులకు సంతర్పణలూ, దానాలూ ఇవ్వండి. దానితో అన్ని పీడలూ విరగడయి పోతాయి, మేలు కలుగుతుంది,'' అని బ్రాహ్మణులు సలహా ఇచ్చారు.

బింబిసార మహారాజు ముందూ వెనకా చూడకుండా, బ్రాహ్మణులు చెప్పినదంతా నమ్మేసి, తన కోశాధికారిని పిలిచి, ''నాలుగు దారులు కలిసిన చోటనల్లో యజ్ఞం జరగాలి. సంతర్పణలూ, సంభావనలూ, దానాలూ మొదలైనవి జరగాలి. అందుకుగాను సన్నాహాలు ప్రారంభించండి,'' అని చెప్పాడు.

ఈ వార్త మహారాణి తెలుసుకున్నది. ఆమె తన భర్తతో, ''ప్రభూ, తొందరపడి ఈ యజ్ఞాలు ప్రారంభించకండి. అన్నీ తెలిసిన మహాజ్ఞాని,

జాతక కథ



బుద్ధభగవానుడు జేతవనంలో ఉంటున్నాడు. మీరు అక్కడికి వెళ్ళి, ఆయనకు మీ కలల వైనం చెప్పి, వాటి ఫలితం ఏమిటో అడగండి. ఆయన చెయ్యమంటే యజ్ఞాలు అలాగే చేద్దురుగాని!'' అన్నది.

దీనికి బింబిసార మహారాజు అంగీకరించాడు. ఆయన స్వయంగా జేతవనానికి వెళ్ళి బుద్ధభగవానుణ్ణి తమ ఇంట భిక్షకు ఆహ్వానించాడు. బుద్ధుడు భిక్షకోసం రాజసౌధానికి వచ్చాడు. అప్పుడు మహారాజు బుద్ధభగవానుడితో, ''స్వామీ, తమకు తెలియని రహస్యాలుండవు. నాకు కొన్ని పీడకలలు వచ్చాయి. వాటివల్ల కలిగే దుష్ఫలితాలేవో తమరు తెలియజేయాలని నా ప్రార్థన!'' అన్నాడు.

''ఆ కలలు ఏమిటో చెబితే ఫలితాలు చెప్పగలను,'' అన్నాడు బుద్ధుడు, రాజు అమాయకత్వానికి నవ్వుతూ.

''మొట్టమొదటగా నేను కలలో నాలుగు ఆబోతులను చూశాను. అవి భీకరంగా రంకెలు వేస్తూ రాజసౌధం ఆవరణలోకి వచ్చాయి. అవి పోట్లాడుకుంటే చూసి ఆనందించుదామని జనం గుంపులు గుంపులుగా వచ్చారు. కాని ఆ ఆబోతులు పోట్లాడుకోక, వేటి దారిన అవి వెళ్ళిపోయాయి. దీని అర్థమేమిటి?'' అని మహారాజు అడిగాడు.

''రాజా, ఈ కల నీకుగాని, నీ తరానికిగాని సంబంధించినది కాదు. ముందు యుగాలలో రాజులు పాపకర్ములైపోతారు. అప్పుడు మేఘాలు వచ్చి కూడా వర్షించకుండానే వెళ్ళిపోతాయి. వాటి మీద ఎంతో ఆశ పెట్టుకున్న ప్రజలు నిరాశ చెందుతారు, '' అన్నాడు బుద్ధుడు.

''తరవాత ఇంకొక వింత చూశాను. భూమిలో పుట్టిన మొక్కలు ఎంతో ఎత్తు ఎదగకుండానే పూలు పూచి, కాయలు కాయటం చూశాను. దీని రహస్యమేమిటి?'' అని మహారాజు అడిగాడు.

''నే నింతకు మునుపు చెప్పిన పాపిష్ఠి కాలంలో స్త్రీలకు బాల్యవివాహాలు జరుగుతాయి. వారు పెరిగి పెద్దవారు కాక పూర్వమే బిడ్డల తల్లులవుతారు! అంతకంటె ఇంకేమీ లేదు!'' అన్నాడు బుద్ధుడు.

''ఆవులు దూడలవద్ద పాలు తాగేట్టు మరొక కల వచ్చింది,'' అన్నాడు రాజు.

''ముసలివాళ్ళు తమ తిండికోసం చిన్నవాళ్ళపై ఆధారపడే దుర్దినాలు రాబోతాయని దాని అర్థం,'' అన్నాడు బుద్ధుడు.

“తరవాత కలలో కొందరు రైతులను చూశాను. వారు కాడి నుంచి బలిష్ఠమైన ఎద్దులను తొలగించి, ఆ కాడికి లేగదూడలను కట్టటం కనిపించింది,” అన్నాడు మహారాజు.

“నేనింతకు పూర్వం చెప్పిన అవినీతిగల రాజులు రాజ్యాధికారాల నుంచి సమర్థులైన మంత్రులను తొలగించి, ప్రపంచజ్ఞానం లేని యువకులను ఆ పదవులలో నియోగించబోతారు. అదే ఆ కలకు అర్థం!” అన్నాడు బుద్ధుడు.

“తరవాత ఒక వింత గుర్రాన్ని చూశాను. దానికి రెండు వైపులా తలలున్నాయి. ఆ రెండు తలలతోటీ అది దాణా తింటున్నది. ఈ ఘోరం ఏమిటి, స్వామీ?” అని మహారాజు అడిగాడు.

“రాబోయే పాపిష్ఠికాలంలో న్యాయాధికారులు తగాదాలు పరిష్కరించటంలో నిష్పాక్షికంగా ఉండటానికి బదులు, రెండు పక్షాల వారి నుంచీ లంచాలు మేస్తారు.అదే దాని అర్థం,” అన్నాడు బుద్ధుడు.

“తరవాత ఇంకొక చిత్రం చూశాను. రాజభవనం పక్కనే ఒక పెద్ద కడవ నిండా నీరున్నది, దాని చుట్టూ ఇంకా చిన్న కడవలెన్నో ఖాళీగా ఉన్నాయి. అక్కడికి అన్ని కులాల వారూ నీరు పట్టుకు వచ్చి, అదివరకే నిండి వున్న కడవలోనే నీరు పోసి, అది పొర్లిపోతున్న సంగతి కూడా గమనించకుండా వెళ్ళిపోతున్నారు. ఖాళీ కడవల్లో ఎవరూ నీరు పొయ్యరు. ఏమిటి దీని అర్థం?” అని మహారాజు అడిగాడు.



“ముందు, ముందు అధర్మం పెచ్చుపెరుగుతుంది. ప్రజలు కష్టించి సంపాదించిన ధనమంతా రాజుగారి ఖజానాలో పోస్తారు. ఒక వంక ఖజానాలో ధనం మూలుగుతూ వుంటే, ఇంకో వంక శ్రమించే ప్రజల ఇళ్ళు ఆ ఖాళీ కుండల్లాగా ఉంటాయి,” అన్నాడు బుద్ధుడు.

“మరొక కలలో ఒక పాత్రలో అన్నం ఉడుకుతూ ఉండటం చూశాను. ఆ అన్నమంతా ఒక రకంగా ఉడకడం లేదు. ఒక భాగంలో ఉడుకు జాస్తి అయి మెతుకు చిమిడిపోయింది. ఒక భాగంలో అన్నం సరిగా ఉడికింది. వేరొక భాగంలో బియ్యం బియ్యంగానే ఉంది,” అన్నాడు మహారాజు.

“రాబోయే కాలంలో వ్యవసాయం ఇలాగే ఉండబోతుందని, ఈ కల చెబుతున్నది. పాలకులు వరదలను గురించీ, అనావృష్టి

గురించీ తగు శ్రద్ధ తీసుకోరు. అందుచేత కొన్నిచోట్ల వర్షం హెచ్చుగా కురిసి, వరదలవల్ల పంటలు పాడవుతాయి. సరిగా వాన కురవని చోట అసలు పంటలే పండవు,'' అన్నాడు బుద్ధుడు.

''స్వామీ, ఇంకొక కలలో కొందరు మనుషులు అమూల్యమైన మలయ చందనాన్ని వీధి వెంట అమ్ముతూ డబ్బులు పుచ్చుకుంటూండటం చూశాను,'' అన్నాడు మహారాజు.

''భవిష్యత్తులో కొందరు నీచులు పవిత్రమైన ధర్మబోధలు ప్రజల కిచ్చి, అతితుచ్ఛమైన ఐహికసుఖాలను దానికి ప్రతిఫలంగా పుచ్చుకుంటారు,'' అన్నాడు బుద్ధుడు.

''ఇంకా, నా కలలలో నీళ్ళ మీద బరువైన రాళ్ళు తేలికొట్టుకుపోతూండటం చూశాను. ఒక రాజహంసల గుంపు ఒక కాకి వెనక నడుస్తూ ఉండటం చూశాను. మేకలు పులులను తరిమి చంపి తింటూ ఉంటే, తోడేళ్ళు సయితం భయంతో కంపించటం చూశాను. ఇవన్నీ అరిష్ట దాయకాలు కావా, స్వామీ?'' అని మహారాజు అడిగాడు.

''ఈ కలలు నీకుగాని, నీ కాలానికి గాని సంబంధించినవి కానేకావు. వాటిని గురించి నీకు ఎలాటి విచారమూ వద్దు. భవిష్యత్తులో ధర్మం నశించి పాపం పెరగటం వల్ల ఎంత మహిమ గలవాళ్ళు సయితం నీచులైన రాజుల అనాదరానికి గురి అయి కాలప్రవాహంలో నువ్వు చూసిన రాళ్ళలాగా కొట్టుకుపోతారు. పరమ నీచులు పదవులకు రావటం వల్ల రాజహంసల వంటి యోగ్యులు సయితం వారి అడుగుజాడలలోనే నడవవలసిన వారవుతారు. అధములకు అధికారబలం లభించే సరికి సత్యసంపన్నులు కూడా వారిని చూసి భయపడవలసి వస్తుంది. అంతే కాదు, ఏమాత్రం సంకోచం అన్నది లేకుండా అధములు వారిని నిర్మూలించటం కూడా జరుగుతుంది,'' అన్నాడు బుద్ధుడు.

బింబిసార మహారాజుకు సందేహం తీరిపోయింది. ఆయన భయాలు తొలగిపోయాయి. ఆయన యజ్ఞాలు చేయించే ఆలోచన కట్టిపెట్టి, బుద్ధభగవానుడికి భిక్ష పెట్టి పంపేశాడు.





# రామాయణం

జరిగిన దానికి చింతిస్తూ రాముడు, ''సుగ్రీవుడా, నా మీద ఆగ్రహించకు. మీరిద్దరూ ఒక్కటిగానే ఉన్నారు. మీ కంఠస్వరాలు కూడా ఒకటిగానే ఉన్నాయి. ఎవరు ఎవరో తెలియక నేను బాణం వెయ్యలేదు. నా అజ్ఞానం చేత నీకు అపాయం కలిగింది. మన్నించు. నువ్వు ఏదైనా గుర్తు ధరించి మళ్ళీ వాలితో యుద్ధం చేసినట్టయితే ఒక్క బాణంతో అతన్ని పడగొట్టుతాను, నా మాట నమ్ము,'' అన్నాడు.

కొండచరియ పైన గజపుష్పి అనే లత పూలతో సహా పెరుగుతున్నది. లక్ష్మణుడు దాన్ని పెరికి తెచ్చి సుగ్రీవుడి మెడకు చుట్టాడు. అందరూ మరొకసారి కిష్కింధకు బయలుదేరి వెళ్ళారు.

గజపుష్పి మెడకు చుట్టుకున్న సుగ్రీవుడి వెంట నళుడూ, నీలుడూ, తారుడూ కూడా ఉన్నారు. కిష్కింధకు వెళ్ళే దారిలో రాముడికి చెట్లతో దట్టంగా ఉన్న ఒక వనం కనిపించింది. రాముడు దాన్ని గురించి సుగ్రీవుడి ద్వారా తెలుసుకున్నాడు. అది ఒక ఋష్యాశ్రమం. సప్త జనులనే పేరు గల ఏడుగురు ఋషులు ఆ ఆశ్రమంలో తీవ్రమైన తపస్సు చేశారు; నీటిలో తల్లకిందులుగా నిలబడి, వాయుభక్షణ చేస్తూ తపస్సు చేసి, శరీరాలతో స్వర్గానికి వెళ్ళిపోయారు. ఆ ఆశ్రమంలోకి మనుషులు కారు గదా, పశుపక్ష్యాదులు కూడా ప్రవేశించ లేవు; తెలియక లోపలికి వెళితే తిరిగి బయటికి రావటమంటూ ఉండదు.

కిష్కింధా కాండ - 3



రామలక్ష్మణులిద్దరూ సప్తజన మహర్షులను తలుచుకుని ఆ ఆశ్రమానికి నమస్కరించి ముందుకు పోయారు. చాలాదూరం వెళ్ళాకవారు కిష్కింధ చేరుకున్నారు. సుగ్రీవుడు రాముడితో, "వాలిని చంపుతానని మాట ఇచ్చావు. ఆ పని శీఘ్రంగా చెయ్యాలి," అన్నాడు.

"ఈసారి వాలిని ఒక్క బాణంతో నిశ్చయంగా పడగొట్టుతాను. ఒకే రూపు గల మీ ఇద్దరిలో తారతమ్యం తెలియటానికి ఈసారి నీ మెడలో గజపుష్పీలత ఉన్నది కద. అందుచేత నీకేమీ జంకు వద్దు. వాలిని యుద్ధానికి పిలువు," అని రాముడు చెప్పాడు. చుట్టూ ఉండే దట్టమైన అరణ్యంలో అందరూ దాగారు.

సుగ్రీవుడు ఆ అరణ్యాన్ని ఒక్కసారి కలయజూసి భయంకరంగా గర్జించి వాలిని యుద్ధానికి పిలిచాడు.

ఈ గర్జన వింటూనే వాలికి పట్టరాని ఆగ్రహావేశం వచ్చేసింది. అతను యుద్ధానికి బయలుదేరాడు. ఇది చూసి తార చప్పున లేచి వాలిని పట్టుకుని, ఇలా అన్నది:

"ఈ రాత్రివేళ నువ్వు వెళ్ళి సుగ్రీవుడితో యుద్ధం చెయ్యవద్దు. కావలిస్తే రేపు ఉదయం వెళుదువుగాని. ఈలోపుగా నీ బలం తరిగిపోదు, సుగ్రీవుడి బలం హెచ్చిపోదు. ఇంతలో వచ్చిన తొందర ఏమిటి? కొంచెం ఆలోచించు! నేను అకారణంగా నిన్ను అడ్డగించటం లేదు. ఒకసారి నీ చేత చావు దెబ్బలు తిని దిక్కు తెలియకుండా పారిపోయిన సుగ్రీవుడు ఇప్పుడు ఏ ధైర్యంతో నిన్ను యుద్ధానికి పిలుస్తున్నాడు? ఎవరి అండో చూసుకునే అతను నిన్ను కవ్విస్తున్నాడు. వారెవరో కూడా నాకు తెలుసు. అయోధ్య రాజైన దశరథుడి కొడుకులు రామలక్ష్మణులు సుగ్రీవుడుండే ఋశ్యమూకానికి వచ్చి అతనితో సఖ్యం చేశారట. వారు ఇదివరకే విరాధుణ్ణీ, ఖర దూషణులనూ, కబంధుణ్ణీ చంపారట. చాలా పరాక్రమవంతులు. వారిని గురించి మన అంగదుడికి చారులు చెప్పారు. సుగ్రీవుడు చాలా గడుసువాడు. ఒకంతట ఇతరులను నమ్మడు. రాముడి అండ చూసుకునే అతను ఇప్పుడు వచ్చాడు; అందుకేమీ సందేహం లేదు. నీ మేలుకోరి ఇంకొక మాట కూడా చెబుతాను. ఇప్పుడు సుగ్రీవుడు నీ కన్న బలవంతుడని తెలుసుకో. అతన్ని పిలిచి యువరాజుగా అభిషేకించు. నీ తమ్ముడే కదా, కిష్కింధలోనే ఉండనీ. నీకు రాముడి

స్నేహం కూడా కలిసి వస్తుంది. సుగ్రీవుడితో యుద్ధమంటే రాముడితో యుద్ధమే. రాముడితో యుద్ధం నీకు క్షేమకరం కాదు.''

తార చెప్పిన ఈ మాటలు వాలికి కొంచెం కూడా రుచించలేదు. అతను ఆమెతో, ''తారా, నువ్వు నా మేలు కోరే ఈ మాటలన్నావు, కాని పిరికిదానివైన నీ మాటలు విని సుగ్రీవుడి ధూర్తత్వాన్ని సహిస్తానా? మహామహా వాళ్ళకే నేను భయపడలేదు, సుగ్రీవుడికి భయపడతానా? రాముడు నన్నెందుకు చంపుతాడు? అతనికి నేనేమీ ద్రోహం చెయ్యలేదు గద. సుగ్రీవుణ్ణినేను చూస్తూ చూస్తూ చంపుతానా? శరీరమంతా నజ్జుగా కొట్టి బుద్ధి చెప్పి పంపేసి వస్తాను. నువ్వూ, మిగిలిన స్త్రీలూ నా వెంట పడి రాకండి; వెనక్కు వెళ్ళి పొండి,'' అన్నాడు.

స్త్రీలు వెళ్ళిపోయారు. వారు భయపడతారని అంతదాకా తన ఆగ్రహాన్ని అణచుకుని ఉన్న వాలి భయంకరాకారం ధరించి, కిష్కింధా నగరద్వారం దాటి వచ్చి-నడుము బిగించి తనకోసం ఎదురు చూస్తున్న సుగ్రీవుణ్ణి చూశాడు. వెంటనే తాను కూడా నడుము బిగించి, ''నీ ప్రాణాలు తీస్తాను,'' అంటూ వాలి సుగ్రీవుణ్ణి తన పిడికిలితో కొట్టాడు. ఇద్దరూ చెట్లు పీకి, వాటితో ఒకరినొకరు చావగొట్టుకున్నారు. వాలి అలిసిపోయాడు గాని, సుగ్రీవుడు మరింత హెచ్చు అలిశాడు. భయంతో నలు దిక్కులు చూడసాగాడు. సుగ్రీవుడి క్షీణస్థితి గమనించి రాముడు కాలసర్పంలాటి బాణాన్ని ఏరి, ఎక్కుపెట్టి చెవిదాకా లాగి, వాలి ఎదురు రొమ్ముకు గురి





చేసి విడిచాడు. వాలి దాని దెబ్బకు కింద పడిపోయాడు. అనేక సువర్ణాభరణాలూ, ఇంద్రుడిచ్చిన కాంచనమాలికా ధరించి నేలపై పడి ఉన్న వాలి వద్దకు రామలక్ష్మణులు వెళ్ళారు.

వాలి మెల్లగా కళ్ళు తెరిచి రామలక్ష్మణులను చూసి రాముడితో, ''నువ్వు మహారాజు కొడుకువు, గొప్ప వంశంలో పుట్టిన వాడవు, ధర్మాచరణ చేసేవాడివి, నేను మరొకరితో యుద్ధం చేస్తూండగా నన్ను బాణం వేసి కొట్టటం నీకేమంతా ఖ్యాతికరం? తార నన్ను యుద్ధానికి వెళ్ళవద్దని చెబితే నీ వంశాన్నీ, గుణాలనూ నమ్మి, నన్నేమీ చేయవనుకుని వచ్చాను. నేను నీ దేశానికి రాలేదు. నీకేమీ అపకారం చెయ్యలేదు. నిన్ను యుద్ధానికి పిలవలేదు. వానర మాత్రుణ్ణి, అందులోనూ మరొకరితో పోరుతున్నవాణ్ణి. నన్ను నీవెందుకు హత్య చేస్తున్నావు? నువ్వు దుర్బుద్ధివి. విల్లు పట్టుకు తిరిగే నీచ హంతకుడివి. నీకు ధర్మమన్నది లేదు. నన్ను జంతువులాగా వేటాడావనుకుందామన్నా, నా చర్మం ధరించటానికి పనికిరాదు. నా రోమాలూ, ఎముకలూ ఉపయోగపడవు. నా మాంసం తినటానికి పనికిరాదు. నువ్వు నిజంగా పరాక్రమం కలవాడవయితే రావణుడు మొదలైన వారిని చంపరాదా? నా ఎదుటికి వచ్చి యుద్ధం చేస్తే ఈపాటికి యముడి వద్ద ఉండేవాడవు. సీతను వెతకమని నన్నే కోరి ఉంటే ఒక్క రోజులో నీ భార్యను తెచ్చి నీకిచ్చి ఉందును. అందుకే గదా నువ్వు సుగ్రీవుడికి ఉపకారం చెయ్యబోయి నన్ను చంపావు?'' అన్నాడు.

వాలి చేసిన ఈ ఆక్షేపణకు రాముడీవిధంగా జవాబు చెప్పాడు: ''నీకు ధర్మార్థ కామాలకు సంబంధించిన ఆచారాలు తెలియవు. సమస్త భూమండలానికీ ఇక్ష్వాకులు రాజులు. భూమండలంలో అధర్మాన్ని శిక్షించే బాధ్యత ఇక్ష్వాకు రాజులది. ప్రస్తుతం భూమి కంతకూ భరతుడు రాజు. నా బోటి క్షత్రియులం అతని ఆజ్ఞకు బద్ధులమై అధర్మాన్ని శిక్షిస్తున్నాము. వానరుడవు కావటంచేతనూ, వానరుల సాంగత్యం కలిగి ఉండటం చేతనూ నీకు ధర్మసూక్ష్మాలు తెలియవు. నువ్వు నీ తమ్ముడి భార్యను పరిగ్రహించావు.ఇది మహాపాపం. అందుకు మరణమే శిక్ష. నిన్ను శిక్షించక వదిలితే నేను ధర్మం తప్పిన వాణ్ణవుతాను. అదీ గాక నేను సుగ్రీవుడితో చేసిన మైత్రి, లక్ష్మణుడికీ నాకూ గల బాంధవ్యం లాటిది. నేను భార్య నిమి

త్తమూ, అతను రాజ్యం నిమిత్తమూ ఈ సఖ్యం చేసుకున్నాము. నిన్ను చంపుతానని వానరుల ముందు నేను ప్రతిజ్ఞ చేశాను. నేను చేసిన ప్రతిజ్ఞ తప్పటానికి వీలులేదు. అందు చేత నిన్ను వధించటంలో నేను అధర్మం అణుమాత్రం కూడా చెయ్యలేదు. నువ్వు కొన్ని మానవ ధర్మాలు ఆచరించటం చేత పైవిధంగా చెప్పాను. కోతివిగా చూస్తే నిన్ను నేను ఏ సమయంలోనైనా వేటాడవచ్చు. అభక్ష్య మృగాలను కూడా వేటాడుతారు. అవి ఏమరుపాటున ఉన్నవా, పారిపోతున్నవా, నిర్భయంగా ఉన్నవా అని చూడరు. కోతివైన నిన్ను నేను నాతో యుద్ధం చేస్తేనే చంపాలన్న నియమం ఎక్కడా లేదు.''



రాముడు చెప్పినదంతా విని వాలి తాను రాముణ్ణినిందించినందుకు పశ్చాత్తాపపడ్డాడు. అతను రాముడితో, ''నాకు చచ్చి పోతున్నానని దిగులు లేదు. నీ చేతిలో చావాలనే తార వద్దన్నా వినకుండా సుగ్రీవుడితో ద్వంద్వ యుద్ధానికి వచ్చాను. నాకు అంగదుడు ఒక్కడే కొడుకు. వాణ్ణి గురించే నాకు దిగులు. వాణ్ణి సుగ్రీవుడు సరిగా చూసేలాగు చూడు. సుగ్రీవుడికి నా భార్య అయిన తారపై కక్ష ఉండవచ్చు. అతను ఆమెను అవమానించకుండా చూడు,'' అన్నాడు. కొంత సేపటికి అతనికి స్పృహ తప్పింది.

రాముడి బాణంతో వాలి దెబ్బ తిన్న వార్త తారకు తెలిసింది. ఆమె దుర్భరమైన దుఃఖంతో తన కొడుకుతో సహా కిష్కింధ నుంచి వచ్చింది. రాముడి చేత దెబ్బతిన్న వాలిని చూసి భయపడి కొందరు వాలి అనుచరులు పారిపోయి వస్తూ, తారకు ఎదురయ్యారు. వారు తారతో, ''అమ్మా, నీ కొడుకింకా బతికి ఉన్నాడు. వాణ్ణి కాపాడు కోవటానికి తిరిగి వెళ్ళిపో. మృత్యువు రాముడి రూపంలో వచ్చి వాలిని తీసుకుపోతున్నది. అంగదుడికి పట్టాభిషేకం చెయ్యాలి. కిష్కింధ ద్వారం మూసి జాగ్రత్తగా రక్షించాలి. అలా చేయని పక్షంలో నువ్వు కిష్కింధను శత్రువులకు విడిచి పారిపో,'' అన్నారు.

''అంతటి భర్తే పోతుంటే ఇక నాకీ రాజ్యమూ, ఈ కొడుకూ, ఈ శరీరమూ పట్టుతాయా? నేను నా భర్త పాదాల దగ్గిరకేపోతాను,'' అని వలవలా ఏడుస్తూ తార వాలి పడి ఉన్న చోటికి వెళ్ళింది. ఆమె రామలక్ష్మణులనూ, సుగ్రీవుణ్ణీ దాటి వెళ్ళి వాలిని చేరుకుని, అత

నికి స్పృహ లేకపోవటం చూసి ప్రాణం పోయిందనుకుని మూర్ఛపోయింది. తరవాత స్పృహనుంచి తేరుకుని భర్తను కౌగలించుకుని పెద్దపెట్టున ఏడవసాగింది.

వాలి సమీపంలోనే నిలబడి ఉన్న హనుమంతుడు తారను ఓదార్చ యత్నించాడు. అంతలో వాలి కళ్ళు తెరిచి ఎదురుగా ఉన్న సుగ్రీవుణ్ణి చూసి , ''సుగ్రీవా, మనం అన్నదమ్ములుగా సఖ్యం కలిగి, రాజ్య భోగాలను కలిసి అనుభవించటానికి నోచుకోలేదు. అందుచేతనే నిన్ను వెళ్ళగొట్టాను. నీ భార్యను అపహరించానని నాపై కోపం ఉంచుకోకు. నా కొడుకు అంగదుణ్ణి నీకు అప్పగిస్తున్నాను. వాణ్ణి నేను చూసినట్టుగానే చూడు, నేను లేని లోటు రానియ్యకు. ఇక వానర రాజ్యం నువ్వే ఏలుకో. నా ప్రాణాలు పోయేలోపుగా ఈ కాంచనమాలికను తీసుకో,'' అన్నాడు. తరవాత అతను అంగదుడితో, ''నాయనా, ఇకనుంచీ నువ్వు మీ పినతండ్రి చెప్పినట్టు నడుచుకో. అతని శత్రువులతోగాని, వారి మిత్రులతోగాని చేరకు. నన్ను ఎలా చూసుకున్నావో అలాగే సుగ్రీవుణ్ణి చూసుకో,'' అని చెప్పి ప్రాణాలు వదిలాడు. వానరులందరూ ఒక్కసారి గొల్లున ఏడిచారు. తార తన భర్త కళేబరాన్ని కౌగలించుకుని అలాగే మూర్ఛపోయింది.

తరవాత నీలుడు వాలి రొమ్మున నాటుకున్న రామబాణాన్ని లాగేశాడు. అంగదుడు తండ్రి పాదాలకు నమస్కారం చేశాడు. సుగ్రీవుడు కళ్ళ నీరు కార్చుతూ రాముణ్ణి సమీపించి, ''రామా, నువ్వు అన్న ప్రకారం వాలిని వధించావుగాని నాకు భోగాల మీదా, జీవితం మీదా కూడా విరక్తి కలిగింది. ఈ తారా, కిష్కింధలోని వానరులూ, అంగదుడూ ఇలా దుఃఖ సముద్రంలో మునిగి ఉండగా నాకు రాజ్యమేమిటి? వాలి నన్ను పెట్టిన కష్టాలు తలుచుకున్న కోపంతో అతని చావు కోరాను. ఇప్పుడు పశ్చాత్తాపం నన్ను దహించేస్తున్నది. వాలి దొడ్డబుద్ధి గలవాడు, నన్ను చంపటానికి ఎన్నడూ యత్నించలేదు. అతణ్ణి చంపాలన్న హీనమైన కోరిక మహా పాపినైన నాకే కలిగింది. నేనుకూడా వాలితోపాటు దహనమైపోతాను. వానరులు నీ కోసం సీతను అన్వేషిస్తారు,'' అన్నాడు.





# అదృష్టవంతుడు

ఒక ఊళ్ళో శివనాథుడనే యువకుడు ఉండే వాడు. వాడు చాలా అల్లరివాడు. అందుచేత వాడంటే ఊళ్ళో ఎవరికీ పడేదికాదు. వాడికి చదువు అంటలేదు.

ఒకసారి ఒక గొప్ప జ్యోతిష్కుడు వచ్చి, ఊరి మధ్యనగల మర్రిచెట్టు కింద మకాం పెట్టాడు. తన భవిష్యత్తు ఎలా ఉండేదీ తెలుసుకుందామని శివనాథుడు కూడా వచ్చి, జ్యోతిష్కుడికి తన చెయ్యి చూపించాడు.

జ్యోతిష్కుడు శివనాథుడి చెయ్యి చూసి తటాలున వదిలేసి, ''నా జీవితంలో ఇంత అదృష్టవంతుడి చెయ్యి చూడలేదు. త్వరలోనే నువ్వు మట్టిపట్టుకుంటే బంగారమవుతుంది. చాలా గొప్పవాడివవుతావు,'' అన్నాడు.

ఈ మాటలు శివనాథుడే నమ్మలేక పోయాడు. ఊళ్ళో వాళ్ళు నవ్వేశారు. అది చూసి జ్యోతిష్కుడు, ''శాస్త్రం అబద్ధం చెప్పదు. అదృష్టం తన్నుకువస్తే, చేసిన నేరమే వరం కావచ్చు,'' అన్నాడు.

ఊళ్ళో వాళ్ళు తనను పరిహాసం చేసినం దుకు శివనాథుడు ఎలాగైనా గొప్పవాడు కావటానికి తీర్మానించుకున్నాడు. కాని గొప్ప వాడు అయ్యే మార్గం వాడికి తెలీదు.

''ముందు కాస్త డబ్బు సంపాదిస్తే, గొప్ప తనం నిన్ను వెతుక్కుంటూ వస్తుంది,'' అని ఎరిగినవాడు ఒకడు అన్నాడు. కాని డబ్బు సంపాదించే మార్గం కూడా శివనాథుడికి తెలీదు. వాడికి పనిపాటలు రావు, చదువు లేదు.

ఉన్న ఊళ్ళో తనపై ఎవరికీ సదభిప్రాయం లేదు గనక, ముందు ఊరు విడిచి పెట్టటం వాడికి అవసరం అనిపించింది. వాడు ఊరు దాటి, అడవిలో ప్రవేశించి చాలా దూరం నడిచాడు. ఒక చోట ఒక చెట్టు కింద ఒక మనిషి పడుకుని నిద్రపోతూ వాడికి కనిపిం

**25**-ఏళ్ళనాటి చందమామ కథ



చాడు. ఆ నిద్రపోయే మనిషి పక్కన ఒక పెద్ద కత్తీ, ఒక మూటా ఉన్నాయి.

శివనాధుడు ఆ మూట విప్పి చూశాడు. దాని నిండా బంగారు నాణాలు కనబడ్డాయి. శివనాధుడికి జ్యోతిష్కుడి మాటలు జ్ఞాపకం వచ్చాయి. వాడు సందేహించకుండా, ఆ మూటనూ, కత్తినీ తీసుకుని, కాలిసత్తువ కొద్దీ పరిగెత్త సాగాడు. ఇంతలోనే, చెట్టు కింద నిద్రపోతున్న వాడు లేచి, జరిగిన సంగతి గ్రహించి, పెద్దగా అరుస్తూ శివనాధుణ్ణి తరుముకుంటూ వచ్చాడు.

శివనాధుడు వెనక్కు తిరిగి చూసి, ఇక ఆ మనిషికి అందకుండా పారిపోలేమని గ్రహించి నిలబడ్డాడు. ఇంతలో ఆ మనిషి దగ్గిరికి రానే వచ్చాడు. శివనాధుడు తన వద్ద ఉన్న కత్తితో అతణ్ణి ఒక్క పోటు పొడిచాడు. ఆ మనిషి పెద్ద కేక పెట్టి కూలిపోయాడు. ఆ మనిషి కొద్ది సేపు కాళ్ళూ, చేతులూ కొట్టుకుని ప్రాణం వదలటం శివనాధుడు చూసి, కొయ్యబారి పోయాడు. తాను దొంగతనమే గాక హత్య కూడా చేశాడు. ఏమైనా వాడు తనకు చిక్కిన బంగారాన్ని మాత్రం వదల దలుచుకోలేదు. ఆ శవం దగ్గిర నుంచి సాధ్యమైనంత వేగంగా ముందుకు సాగిపోయి, మరొక గంటకల్లా అడవిదాటి, ఒక ఊరు చేరాడు.

ఆ ఊళ్ళో వాడికి ఎదురైన మొట్టమొదటి మనిషి, ''నీ అంగీనిండా ఆ రక్తం ఏమిటి?'' అని అడిగాడు.

అంత దాకా తన అంగీ మీద ర[illegible]న్నట్టు ఎరగని శివనాధుడు [illegible]డా, ''ఎవడో దొంగ నా సొ[illegible]యాలని చూశాడు. కత్తితో పొడి[illegible] అని బొంకాడు.

క్షణంలో ఈ వా[illegible]ంతా పొక్కింది. పది మంది చేరి శివనాధుడు చెప్పిన చోటికి వెళ్ళారు. చచ్చిపోయిన వాడు, 'కాలయ ముసుగు' అని పేరుమోసిన గజదొంగ! వాణ్ణి చంపిన వా[illegible] పదివేల వరహాలు బహుమానం ఇస్తానని కూడా రాజు ప్రకటించి ఉన్నాడు. ఈ సంగతి ప్రజలు శివనాధుడికి చెప్పి జయ జయ ధ్వానాలతో తమ గ్రామానికి తీసుకు వచ్చారు. అతనికి ఒక ఊరంటూ లేదని తెలుసుకుని, వాళ్ళు అతన్ని తమ గ్రామం లోనే ఉండి పొమ్మన్నారు. అనేక ఇళ్ళుగల సంపన్నుడు ఒకాయన శివనాధుడికి ఒక చిన్న ఇంటిని ఉచితంగా ఇచ్చేశాడు. త్వరలోనే

అతనికి రాజుగారి బహుమతి కూడా అందింది. ఇప్పుడు శివనాధుడి దగ్గిర మూలధనం చాలా ఉన్నది. కాని గొప్పవాడు కావటానికి అది చాలదు. ఇంకా ధనం సంపాదించటానికి అతను వ్యాపారం చేయదలచుకుని, కొన్ని గేదెలను కొని పాలవ్యాపారం ప్రారంభించాడు. అధిక లాభాల కోసం అతను పాలలో నీళ్ళు కలిపి అమ్మసాగాడు.

అయితే ఈ వ్యాపారానికి ఒక చిన్న అంతరాయం వచ్చింది. అదేమంటే, శివనాధుడు ఉండే ఊరికి నీటి సౌకర్యం లేదు. గ్రామస్థులకు దూరాన ఉండే ఏరే ఆధారం. చాలా మంది ఏటికి వెళ్ళి నీరు తెచ్చుకుంటారు. తెచ్చుకోలేని వాళ్ళు హెచ్చుకూలీ ఇచ్చి నీరు తెప్పించుకుంటారు. శివనాధుడి పాలవ్యాపారం పెరిగినకొద్దీ నీరు హెచ్చుగా కావలసి వచ్చింది. హెచ్చుకూలీ ఇచ్చి నీరు కొని పాలలో కలిపితే లాభం తరిగిపోతుంది.

అందుచేత శివనాధుడు తన దొడ్లోనే ఒక బావి తవ్వించాలనుకున్నాడు. ఈ పని రహస్యంగా జరగాలి గనక, అతను పొరుగూరి నుంచి కూలీలను రప్పించి, బావి తవ్వించాడు. అతని అదృష్టం ఇందులో కూడా బయట పడింది. ఆ ఊరిలో ఎవరు బావి తవ్వించినా ఎన్నడూ నీరు పడలేదు, కాని శివనాధుడికి పది అడుగుల లోతునే తియ్యని నీరు పడింది. బావి తవ్వకం పూర్తికాగానే అతను కూలీలను రహస్యంగా పంపేశాడు.

అయినా, శివనాధుడు అమ్మే పాలను గురించి గ్రామస్థులకు అనుమానం కలి



గింది. అది బర్రెల తీరు అని అతను అంటే వాళ్ళు నిజమే కాబోలుననుకున్నారు. కాని అతని పాలు ఏమాత్రమూ బాగుండటం లేదు. శివనాధుడి పోటీకి తట్టుకోలేక, లోగడ ఆ గ్రామంలో పాలవ్యాపారం చేసినవారంతా ఊరు విడిచి వెళ్ళిపోయారు. అందుచేత ఇప్పుడు ఊరి వాళ్ళకు శివనాధుడు తప్ప మరోగతిలేదు.

ఈ పరిస్థితిలో, ఊళ్ళో ఉండే రాముడు అనే ఒక యువకుడు రాజుగారి దగ్గిరికి వెళ్ళి, శివనాధుడి మీద ఫిర్యాదు చేస్తూ, శివనాధుడు చాలా పలుకుబడి గలవాడనీ, దర్యాప్తు వీలయినంత రహస్యంగా జరపమనీ వేడుకున్నాడు. రాజుగారి గూఢచారి ఒకడు శివనాధుడి మోసం కనిపెట్టాడు.

శివనాథుణ్ణిపట్టితెప్పించి, న్యాయస్థానంలో నిలబెట్టి, ''నువ్వు పాలవ్యాపారంలో దారుణ మైన కల్తీ చేస్తున్నట్టు రుజువయింది. దీనికి నీ సంజాయిషీ ఏమిటి?'' అని రాజు అడిగాడు.

''నేను చేసిన కల్తీ ఏమిటో సెలవియ్యండి,'' అన్నాడు శివనాథుడు. ''నువ్వు పాలలో నీళ్ళు కలిపావు,'' అన్నాడు రాజు.

''నేను పాలలో నీళ్ళు కలపలేదు, నీళ్ళ లోనే పాలుకలిపాను. కావలిస్తే తెప్పించి చూడండి. నేను అమ్మే నీళ్ళలో పాల కన్న నీళ్ళే ఎక్కువ!'' అన్నాడు శివనాథుడు.

న్యాయస్థానంలో అందరూ గొల్లుమన్నారు.

''అది మరింత అక్రమం!'' అన్నాడు రాజు కోపంగా.

''నేను నీళ్ళవ్యాపారినే గాని, పాలవ్యాపా రిని కాను. మా ఊరిప్రజల ప్రధాన అవసరం నీరు. దానికోసం ఎంతో డబ్బుఖర్చు పెడుతు న్నారు,'' అన్నాడు శివనాథుడు.

అతను ఇలా అనగానే ఆ వూరి గ్రామపెద్ద రాజుతో, ''ఆ మాట నిజమే, మహారాజా! శివ నాథుడు సామాన్యుడు కాడు. కాలయముడి బారి నుంచి మమ్మల్ని కాపాడిన మహానుభా వుడు! అటువంటి వాడు కల్తీ వ్యాపారానికి దిగుతాడంటే నమ్మశక్యం కాదు. మా ఊరి నీటి ఎద్దడి గురించి మీకు తెలిసి రాగలం దులకు ఇలాచేశాడని తోస్తుంది,'' అన్నాడు.

ఈ మాట విని రాజు మండిపడి, ''అయితే, ఇంత కాలమూ మీరు ఏం చేస్తున్నారు? నాకు విజ్ఞప్తి ఎందుకు చేసుకోలేదు?'' అని అడిగాడు.

''చాలా విజ్ఞాపనలు చేసుకున్నాం. మహా రాజా, కాని మీ అధికారులకు ప్రజల నేరా లను విచారించటంలో ఉన్న ఆసక్తి, ప్రజల విన్నపాలను పరిశీలించటంలో లేదు,'' అన్నాడు గ్రామాధికారి.

రాజు శివనాథుణ్ణి వెంటనే విడుదల చేసి, అతనికి అభినందనలూ, బహుమతులూ ఇచ్చాడు. తరవాత నది నుంచి, శివనాథుడు ఉండే ఊరి మీదుగా ఒక కాలువ తవ్వించాడు. శివనాథుడి దయవల్లనే తమకు ఆ కాలువ వచ్చిందని ఊరి వాళ్ళంతా అనుకు న్నారు. శివనాథుడు కీర్తి ప్రతిష్ఠలతో బాటు కోట్లకొద్దీ ధనం ఆర్జించి, పెళ్ళి చేసుకుని, వక్ర మార్గాలు వదిలిపెట్టి, సుఖంగా జీవించాడు.



చిత్రాలు: గాంధి అయ్య

24

# అజేయుడు గరుడుడు!

తండ్రి నరేంద్రదేవుడి ఆనతి ప్రకారం రవీంద్రదేవుడు వజ్రపురికి వెళ్ళి, ఆ రాజును చంద్రపురి మీదికి దండెత్తమని పురికొల్పాడు. అదే సమయంలో ఆదిత్యుడు, ధీరసేనుడు సూర్యపురి సేనలతో వజ్రపురికోటను చుట్టుముట్టారు.

వజ్రపురి కోటలో...

సేనాధిపతి ధీరసేనుడి దూత తమ దర్శనానికి వచ్చాడు ప్రభూ!

లోపలికి పంపించు.

భటుడు వెళ్ళాక...

పుష్పరాజ్, నువ్వే దూతతో మాట్లాడు.

దూత వచ్చి ఆసనంలో కూర్చున్నాడు.

చంద్రపురి సరిహద్దుల నుంచి వజ్రపురి తన సేనలను వెంటనే ఉపసంహరించుకోవాలనీ...

...రవీంద్రదేవుణ్ణి సూర్యపురి సేనలకు అప్పగించాలనీ యువరాజు ఆదిత్యుడు కోరారు.

రెండు కోరికలనూ అంగీకరిస్తున్నట్టు వెళ్ళి యువరాజుకు తెలియజెయ్.

దూత అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

పుష్పరాజ్, నువ్వు వెళ్ళి ధీరసేనుణ్ణి కలుసుకుని శాంతి చర్చలు జరుపు.

ధీరసేనుడిలా శత్రువుతో చేతులు కలపగలడని నేనూహించలేదు.

నువ్వు శాంతిచర్చలు జరుపుతూండగా, రవీంద్రదేవుడు ఇక్కడి నుంచి రహస్య మార్గం గుండా తప్పించుకోవడానికి నేను సాయపడతాను.

చాలా మంచి ఉపాయం ప్రభూ!


వజ్రపురి కోటకు వెలుపలి శిబిరంలో
యువరాజా! తమను దర్శించడానికి చంద్రపురి నుంచి దూతవచ్చాడు.
చంద్రపురి నుంచా? వెంటనే తీసుకురా.


దూత లోపలికిరాగానే, ఆదిత్యుడు అతన్ని గుర్తు పట్టాడు.
ప్రతాప్! నువ్వా? నువ్వు ఇలా వచ్చావేంటి?
వీరబాహు, మహారాజుగారికి స్వాగతం పలకడానికి తమరిని వెంటనే ఆలయానికి రమ్మన్నారు ప్రభూ!


వజ్రపురి సేనలను లొంగిపొమ్మని వీరబాహును ఆజ్ఞాపించమని చెప్పు.
చిత్తం, అలాగే వెళ్ళి చెబుతాను ప్రభూ!


ధీరసేనుడు ఆదిత్యుణ్ణి శిబిరం వెలుపల కలుసుకున్నాడు.
ఇది ఏమాత్రం ఎదురు చూడనిది ధీరసేనా! ఆలయ ప్రారంభోత్సవానికే మహారాజుగారిని ఆహ్వానించాలనుకున్నాం. ఆయన ఇప్పుడే అక్కడికి ఎందుకు వస్తున్నారో తెలియడం లేదు.
మహారాజుగారు రమ్మన్నారు గనక తమరు అక్కడికి తప్పక వెళ్ళాలి!
రెండు రోజుల్లో తిరిగి రాగలను. నువ్వు వజ్రపురి మీద ఒత్తిడి కొనసాగిస్తూనే ఉండాలి.


ఆలయ ప్రాంగణానికి చేరుకున్న ఆదిత్యుడు కొందరు శిల్పకారుల మధ్య రాజగురువును చూశాడు.
ఆదిత్యా! నీ కోసం సూర్యపురికి నేను దూతను పంపాను.
సూర్యపురి సేనలు వజ్రపురి కోటను ముట్టడించాయి. నేను ధీరసేనుడితో అక్కడే ఉన్నాను. గనక, మీరు పంపిన దూత అక్కడికే వచ్చాడు.
తగిన సమయానికి వచ్చావు. మహారాజుగారు ఏక్షణంలోనైనా రావచ్చు.


కొంతసేపటికి రక్షక భటులతో రెండు పల్లకీలు వచ్చాయి. ఆదిత్యుడు, రాజగురువు మహారాజుకు స్వాగతం చెప్పడానికి పల్లకీ దగ్గరికి వెళ్ళారు.


ఆలయ పునరుద్ధారణ పూర్తయింది ప్రభూ!
చాలా సంతోషం గురువర్యా! నేను మరో ప్రత్యేకమైన పనిమీద వచ్చాను.


అరుణతో నీ వివాహం ఆలస్యం కాకూడదని మన జ్యోతిషాచార్యులు చెబుతున్నారు.
ఏమిటి, మహాప్రభూ!


జ్యోతిష్కుడు పరివారం నుంచి ముందుకు వచ్చాడు.
అవును, యువరాజా! ప్రస్తుతం గ్రహాలన్నీ అనుకూలంగా ఉన్నాయి. రేపే శుభముహూర్తం...


...మీరిద్దరూ ఆనందంగా, ప్రశాంతంగా జీవించగలరు.
అయినా, నేను అనుకున్న పనులు ఇంకా పూర్తికాలేదు కదా జ్యోతిషాచార్యా!


ఆదిత్యుడు సూర్యపురిలో నెలకొన్న పరిస్థితులను మహారాజుకు వివరించి వివాహాన్ని వాయిదావేయించడానికి ప్రయత్నించాడు. అయితే...
ఆదిత్యా! తక్కిన వాటి సంగతి తరవాత చూసుకోవచ్చు.
అదే మన మహారాజుగారి అభిమతం!
అరుణ అభిప్రాయమేమిటో తెలుసుకోవాలి కదా!


మీ అభీష్టానికి వ్యతిరేకంగా నేనేం చెప్పగలను ప్రభూ! మీ ఇష్టమే నా ఇష్టం!


ఆదిత్యా, వివాహం చాలా నిరాడంబరంగా జరిగిపోతుంది.
చిత్తం, మహా ప్రభూ!


ఆదిత్యా, వారికి ఆలయాన్ని చూపించు. నేను రేపటికి కావలసిన ఏర్పాట్లు చేస్తాను.


మరునాడు ఉదయం రాజగురువు ముందు, ఆయన వెనక వధువు అరుణ, మహారాజు, వారి వెనక వరుడు ఆదిత్యుడు, జ్యోతిషాచార్యుడు ఆలయానికి బయలుదేరారు.


గర్భగృహం ఎదుట ఆదిత్యుడు, అరుణ పూలదండలు మార్చుకున్నారు.


నా జీవితంలో ఇది మహదానందకరమైన రోజు, ఆదిత్యా!
ఈ రోజు కోసమే నేనిన్నాళ్ళుగా ఎదురు చూస్తున్నాను!


వధూవరులు పెద్దల ఆశీస్సులు పొందారు.
దీర్ఘాయుష్మాన్ భవ!
సకల సౌభాగ్యాలతో కలకాలం వర్ధిల్లండి!
-(ఇంకావుంది)

మన వారసత్వ స్థలాలు

# భీమ్‌బెట్కా గుహలు



మధ్యప్రదేశ్ రాజధాని భోపాల్‌కు నలభై అయిదు కి.మీ. దూరంలో భీమ్‌బెట్కా గుహలు ఉన్నాయి. ఇక్కడి గుహాకుడ్యాలలో దాదాపు 12000-9000 సంవత్సరాల మధ్య కాలంలో చిత్రించబడ్డ వర్ణచిత్రాలు, ఏమాత్రం రంగులు వెలిసిపోకుండా ఉండడం చిత్ర, శిల్పకళాభిమానులకు ఆనందాశ్చర్యాలు కలిగించే విషయం. రాతి యుగానికి చెందిన ఈ వర్ణచిత్రాలు ప్రపంచంలోని అతి ప్రాచీనమైన చిత్రాలలో ముఖ్యమైనవి. 1880లో ఇదొక బౌద్ధ స్థలంగా పేర్కొన బడినప్పటికీ, 1957లో వి.ఎస్. వకాన్కర్ బృందం ఈ వర్ణచిత్రాలను కనుగొన్న నాటి నుంచే ఈ గుహాకుడ్య వర్ణచిత్రాల గురించి ప్రపంచానికి తెలియవచ్చింది. అక్కడక్కడ ఆకుపచ్చ, పసుపుపచ్చరంగులతో ప్రధానంగా ఎరుపు, తెలుపు రంగులతో ఆనాటి ఆదివాసుల జీవిత దృశ్యాలు చిత్రించబడి ఉన్నాయి. వేట, బృందనాట్యం, ప్రసవం, మతసంబంధమైన తతంగాలు, ఇంట్లో జరిగే విషయాలు వాటిలో ముఖ్యమైనవి. ఇక జంతువుల విషయానికి వస్తే-పులులు, సింహాలు, అడవిపందులు, జింకలు, ఏనుగులు, కుక్కలు, దున్నలు, మొసళ్ళు చిత్రించబడి ఉన్నాయి. వేటకు ఉపయోగించిన ఆయుధాలలో ఈటెలు, మొనదేలిన కర్రలు, విల్లంబులు ఉన్నాయి. వీటిని చిత్రించడానికి కూరగాయల రంగులు, దుంపలు, జంతువుల కొవ్వు ఉపయోగించి ఉండవచ్చని భావిస్తున్నారు.

యునెస్కో భీమ్‌బెట్కాను ప్రపంచ వారసత్వస్థలాల జాబితాలోకి తీసుకోవడానికి నిర్ణయిస్తూ ఈ వర్ణచిత్రాలు, ''ప్రజలకూ, వారి పరిసరాలకూ మధ్య నెలకొన్న సుదీర్ఘమైన చర్య, ప్రతిచర్యలను ప్రతిబింబిస్తూ, శిలాకళ వాసినీ, రాసినీ చాటుతున్నాయి,'' అని పేర్కొన్నది.

# వార్తలలో బాలలు

## సహవిద్యార్థుల కోసం



కేరళలోని పూనలూర్ ఫాతీమా పబ్లిక్ స్కూల్లో ఎనిమిదవ తరగతి చదువుతూన్న పదమూడేళ్ళ అలన్, క్రైస్తవ కుటుంబానికి చెందిన వాడు. అతడి తరగతిలో సహవిద్యార్థులు చాలామంది ముస్లిం మతానికి చెందిన వారుకావడంతో రంజాన్ మాసంలో ఉపవాసం ఉండేవారు. మిత్రులు ఉపవాసం చేస్తూండగా తను మాత్రం 'లంచ్ బాక్స్' తెరవడం అలన్‌కు ఇబ్బందికరంగా ఉండేది. ఈ విషయంగా అతడు తన తల్లిదండ్రులతో చర్చించి, మిత్రులతోపాటు తను కూడా ఉపవాస ముండటం మొదలు పెట్టాడు. అతడు ఇఫ్తార్‌కు తన స్నేహితుల ఇళ్ళకు వెళ్ళేవాడు. ముస్లిం సోదరుల పట్ల తన బిడ్డ చూపుతూన్న సంఘీభావానికి అతడి తల్లిదండ్రులు జాన్, వల్సా ఎంతగానో సంతోషిస్తూ అతన్ని ప్రోత్సహిస్తున్నారు.

## పదేళ్ళ వయసులో బహుభాషలు

అర్పణ్ శర్మ అనే పదేళ్ళ బ్రిట్-ఇండియన్ విద్యార్థికి అన్యభాషలు నేర్చుకోవడం అంటే మహా ఇష్టం. ఫ్రెంచ్, జర్మన్ భాషలను అతడు సునాయాసంగా మాట్లాడగలుగుతున్నాడు. ఆఫ్రికన్ భాష అయిన స్వాహిలీలో నిరాఘాటంగా మాట్లాడగలడు. అంతే కాదు. హిందీ, స్పానిష్, ఇటాలియన్ భాషలు కూడా మంచినీళ్ళ ప్రాయంగా మాట్లాడగలడు.




ఇంగ్లాండులోని ఓల్డ్‌బరీలో ఉంటూన్న అర్పణ్, ''భాషలు నేర్చుకోవడం పాఠశాల విద్యలో అంతర్భాగం. ఫ్రెంచ్, స్పానిష్, జర్మన్ భాషలను స్కూల్లోనే నేర్చుకున్నాను. కష్టమైన భాషలను సిడి-రోమ్స్ ద్వారా స్కూలు కంప్యూటర్‌లలోనేర్చుకున్నాను,'' అన్నాడు. థాయ్, పోలిష్, చైనీస్ మాండరిన్ నేర్చుకున్న అతడు ఇప్పుడు కష్టమైన ఉగాండా లుగాండన్ భాషను నేర్చుకుంటున్నాడు. ''స్వాహిలీని నేర్చుకోవడమే నేను ఎదుర్కొన్న పెద్ద సవాలు,'' అని చెబుతూన్న అర్పణ్ సెకండరీ స్థాయికి వెళ్ళగానే మరిన్ని విదేశీ భాషలు నేర్చుకోవాలని ఆలోచిస్తున్నాడు.

# విజ్ఞానం .... వినోదం .... వికాసం ....



## విజ్ఞాన వీచికలు :

### వానర సంస్కృతి

"ఒక తరం నుంచి మరో తరానికి కొన్ని వ్యవహారపద్ధతులు సంక్రమించినప్పుడు సంస్కృతి లేదా సంప్రదాయం ఏర్పడుతుంది," అని సుప్రసిద్ధ జపాను నరవానర గణపరిశోధకుడు సతోషి హిరాటా చెబుతాడు. ఇటీవల జరిగిన కొన్ని అధ్యయనాలు వానరాలు సైతం కొన్ని రకాల సాంస్కృతిక కార్యకలాపాలు జరపడానికి సమర్థవంతమైనవని తెలియజేస్తున్నాయి. ముఖ్యంగా తీరిక సమయాలలో కోతులు కొత్త కొత్త వినోదాలను కనుగొనడం ఈ కొత్త సంస్కృతీ పరిణామ క్రమాన్ని చాటుతున్నాయంటారు.

ఈ అధ్యయనాలు 1948లోనే ప్రారంభమయ్యాయి. ఆహార సంపాదనకు తక్కువ సమయం మాత్రమే కేటాయించవలసినప్పుడు, అవి కొత్త కొత్త కార్యకలాపాలలో, మరింత పనులలో పాల్గొన్నట్టు తెలియవచ్చింది. మానవ సంస్కృతికన్నా 'వానర సంస్కృతి' చాలా భిన్నమైనదే అయినప్పటికీ అది మానవ సంస్కృతీ పరిణామాన్ని విశదపరచడంలో కొంత వెలుగును ప్రసరించగలదని హిరాటా అభిప్రాయ పడుతున్నాడు.

## మన పరిసరాలు

### ఈస్టర్ ఎగ్ బర్డ్



ఈస్టర్ ఎగ్ బర్డ్ అనే టినామో చాలా అరుదైన పక్షి. ఈ జాతికి చెందిన పక్షులు ఎగరలేనివనీ, చదునైన రొమ్ము ఎముక కలగినవనీ చెబుతారు. అయిప్పటికీ టినామోను పూర్తిగా ఎగరలేని పక్షి అని పరిగణించలేము. ఇవి కొన్ని వేల గజాల వరకు ఎగర గలుగుతాయి. ఇవి దక్షిణ అమెరికా వర్షారణ్యాలకు చెందినవి. రుతువులను బట్టి ఈ పక్షులు ఆహారపుటలవాట్లను మార్చుకుంటాయి. కీటకాలు విరివిగా లభించే వేసవికాలంలో వాటిని పట్టి తింటాయి. వాతావరణంలో మార్పుకారణంగా కీటకాలు తగ్గిపోయి లభించలేదనుకుంటే టినామోలు శాకాహారులుగా మారిపోతాయి.

మగ టినామో నేలలో బొరియ చేసి, గూడు నిర్మించి దాన్ని జాగ్రత్తగా కాపాడుతుంది.

ఆడ టినామో రంగురంగుల గుడ్లు పెట్టి, పిల్లలను కాపాడుతుంది. ఇవి పెట్టే రంగు రంగుల గుడ్ల కారణంగానే వీటికి 'ఈస్టర్ ఎగ్ బర్డ్స్' అనే పేరువచ్చింది.

# ఫోటో వ్యాఖ్యల పోటీ

ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్నవాక్యంలోగాని
వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.



TAJY PRASAD



NARAYANAMURTHY TATA



వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా
మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు మార్చ్ 2008 సంచికలో ప్రచురిస్తాం.
ఉత్తమమైన వ్యాఖ్యకు రూ. 100 బహుమానం.
ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ, జెవిఎల్ ప్లాజా 6వ అంతస్తు, 626, అన్నాసాలై,
తేనాంపేట, చెన్నయ్ - 600 018.

## అభినందనలు

నవంబర్ నెల పోటీ ఫలితాలు
మల్లిపెద్ది కృష్ణారావు
తం.పే: నారాయణ
ఇం.నం. 7-18-1ఎ, బాయ్స్ హైస్కూల్ రోడ్,
మార్కాపురం - 523 316,
ప్రకాశం జిల్లా (ఆం.ప్ర)

ఫోటో వ్యాఖ్యల పోటీ:





మొదటి ఫోటో : అలంకరణకు...!
రెండవ ఫోటో : ఆనందానికి...!

## సమాధానాలు :

1. పరమ్‌వీర్ చక్ర 2. సినిమా

3. సి.వి. రామన్-భౌతికశాస్త్రం; డా. చంద్రశేఖర్ - భౌతికశాస్త్రం; ఖొరానా - జన్యుశాస్త్రం

4. క్రీడల కోచింగ్

Printed and Published by B. Viswanatha Reddi at B.N.K. Press Pvt. Ltd., Chennai - 26 on behalf of Chandamama India Limited, JVL Plaza, 6th Floor, 626 (Old 501), Anna Salai, Teynampet, Chennai - 600 018. Editor : B. Viswanatha Reddi (Viswam)

# బాల్యం నుంచి మేము పెరిగింది
# ఆంధ్రాబ్యాంక్ యొక్క కిడ్డి బ్యాంక్ తో

ప్రస్తుతం మా పిల్లలు కూడా అలాగే పెరగాలని కోరుకుంటున్నాము.




ప్రత్యేకించి పిల్లల కోసం, పిల్లల ప్రత్యేక పొదుపు పథకం "ఎబి కిడ్డీ బ్యాంక్" ను ఆంధ్రాబ్యాంక్ వారు పునఃప్రవేశపెడుతున్నారు.
ఈ పథకం ప్రత్యేకమైన బొమ్మతో పాటు అనేక ప్రత్యేకతలను కలిగియున్నది.
నేడే మీ పిల్లల కోసం ఈ ఖాతాని ప్రారంభించి, చిన్న వయస్సులోనే వారిలో పొదుపు అలవాట్లను నేర్పించండి.

**ఆంధ్రాబ్యాంక్ आन्ध्रा बैंक ANDHRA BANK**

(భారత ప్రభుత్వ సంస్థ)

**Much more to do, with YOU in focus**

Chandamama (Telugu) Jan 2008 RNI No. 1114/57. Regd No. TN/CC(S)Dn/159/06-08
Licensed to post WPP - Inland No.TN/CC(S)Dn/84/06-08, Foreign No. 85/06-08






# క్యాడ్‌బరీ బబ్బా సాహసాలు

నలుగురు కుర్రాళ్ళు తమ డింగీతో పడవ వినోదయాత్రకు బయలుదేరారు. వాళ్ళు తటాకాన్ని సమీపించినప్పుడు...



...వాళ్ళకొక సైన్‌బోర్డ్ కనిపించింది. వాళ్ళు డింగీని కింద పడవేశారు.




పిల్లలు చేసేగొడవతో, చెట్టు మీది బొద్దుపిల్లి బబ్బా మేల్కొన్నది. నిరుత్సాహంతో తలలు వంచుకున్న పిల్లల్ని అది చూసింది.




క్షణంలో అది వాళ్ళ ఎదుట దూకింది.




బబ్బా వాళ్ళకు బబ్బాలూ బబుల్‌గమ్ అందించింది. ఒక కుర్రాడు రసవంతమైన బబ్లూను నోట్లో వేసుకున్నాడు.




మరో కుర్రాడు బబుల్‌గమ్‌ను పెద్దదిగా, మరీ పెద్దదిగా, ఇంకా పెద్దదిగా ఊదసాగాడు...




డింగీ తేలడానికి చాలినంత లేతఎరుపు రంగు ద్రవం వెలుపలికి ప్రవహించింది. బబ్బాలూ అలలపై అది ముందుకు సాగింది.



అప్పుడే సాహసయాత్ర ఆరంభమయింది. పిల్లలు అమితోత్సాహంతో బబ్బాను మెచ్చుకున్నారు.




బబ్బా ప్రతి ఒక్కరికీ సందేశం ఇస్తోంది.

